# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 10 ఫిబ్రవరి 1998 సంచిక 2

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : **తారామతి** నాలుగో అట్ట చిత్రం : **ప్రేమామతి**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# శ్రద్ధాంజలి

''నేను ఎవరిని' అని చాలమంది ప్రశ్నించుకొంటూ ఉంటారు ఈ ప్రశ్నను గురించి మీరేమైనా ఆలోచించారా?'' అని **డా. రవీంద్రనాధ్**గారిని ఒకసారి నేను (ప్రస్తుత సంపాదకుడు) ప్రశ్నించినప్పుడు, ''వేదాంతులు మాటాడుకునే ఆత్మ ఏమిటో నాకు తెలియదు కాని, నా మాత్రానికి నేను దానికి ఈ విధంగా సమాధానం చెప్పుకొంటాను'' అన్నారు ఆయన

''నేను నేనే. నేనుకు అర్ధం చెప్పు కోవడానికి నేను నానుంచి బయటికి పోవాలసిన పనిలేదు జీవితంలో అనేక సన్నివేశాలు ఎదురవుతూ ఉంటాయి వాటిల్లో నా పాత్రను నేను నిర్వహిస్తూ ఉంటాను. మామూలుగా ఈ పాత్రల పరంగా నేను 'ఇది' 'పలాన' అని చెప్పుకొంటాం. కేవలం నేను తండ్రి, భర్త, స్నేహితుడు, మొదలైన పాత్రల సంయోగం మాత్రమే కాదు అంతకంటె ఎక్కువ నాకు కొన్ని ఆశంసలు, ఆకాంక్షలు, లక్ష్యాలు ఉంటాయి. నన్ను నేను వాటి పరంగా నిర్వచించు కొంటాను. జీవనం కోసం ఏదో ఒకటి చేస్తూ ఉంటాను. అదే జీవితం కాదు అదే నేను కాదు

''నేను పట్టుదలతో పనిచేస్తే నేను ''ఏదైనా'' కాగలను కాని ''అన్నీ'' నేనే కాలేను ఈ ''కాగలిగే శక్తే'' నాలోని సహజమైన ''నేను'' మామూలు అలవాట్లలో పడి, గాడి జీవితంలో పడి, ' ఏది బడితే అది కాగల శక్తిని,' విస్మరిస్తాము 'నీవు నీవు కా' నీవు నీవుగా బ్రతుకు' నీవు నీవుగా ప్రేమించు, అనుభవించు. ఇలా జీవించడంలోనే నీ 'అసలు తనం' ఉంది అదే 'నీవు' అదే 'నేను' ''

''ఇదే జీవితాన్ని, ఇదే పరిస్థితులతో జీవించే అవకాశం లభిస్తే, అవునంటారా? కాదంటారా?'' అని ఒకసారి నేను అడిగాను.

''నిరభ్యంతరంగా. అయితే అంత మాత్రం చేత నా జీవితంలో ఏమీ ఒడుదుడుకులు జరగలేదని కాదు. అయినా దాని అసంపూర్ణతల తోనే నా జీవితాన్ని తిరిగి నేను జీవిస్తాను నేను కావాలను కొన్నది అయ్యాను

''ఇవాన్ ఇల్యిచ్ (టాల్స్టాయ్ పాత్ర) మరణ శయ్య మీద చెందిన నిర్వేదం నాకేమీలేదు

''ఇల్యిచ్ ఇలా వాపోతాడు: 'నాజీవితం అంతా ఒక ఆభాస అయితే?' అనే ఒక అలోచన అతని మదిలో మెదిలింది. తను అనుకొన్న విధంగా తాను జీవించలేక పోయాడు. తాను వద్దను కొన్ని పనులను తా చేయకతప్ప లేదు చేయాలను కొన్నవి చేయలేకపోయాడు తన వృత్తి పరమైన విధులు, తన కుటుంబం, తన జీవిత క్రమం, తన సామాజిక, ఆర్థిక అభిరుచులన్నీ ఆభాసలై ఉండవచ్చు. జీవితంలో తాను చేసిందంతా ఒక్కవుమాటుగా అబద్ధంగా కనిపించింది. ఇంతకుముందు తాను తన జీవితాన్ని ఎప్పుడూ ఎలా సమర్థించుకొన్నాడో, ఇప్పుడూ అలాగే సమర్థించుకొన్నాడు. కాని అకస్మాత్తుగా తాను సమర్థించే విషయాల లోని బలహీనత అనుభవంలోకి వచ్చింది సమర్థించు కోవలసింది ఏమీ లేదు

''నేను చెప్పాలనుకొంది చెప్పాననుకొంటాను నేనును గురించి నేను ఏమీ అనుకొంటున్నది వ్యక్తం చేశానను కొంటాను'', అని ఆయన ముగించాడు

**'మిసిమి'** వ్యవస్థాపక సంపాదకులు **డా. ఆలపాటి రవీంద్రనాధ్** గారి రెండో వర్ధంతి (ఫిబ్రవరి, 11వ తేది) సందర్భంగా **'మిసిమి'** తన సంతాపం తెలియ జేసుకొంటున్నది

# ''భూతల స్వర్గంలో విరిసిన కమలాలు''

## తారామతి, ప్రేమామతులు

**- కె. జితేంద్ర బాబు**

సంగీత నాట్య కళా వేత్తలను గౌరవించే సంప్రదాయం పూర్వంనుండి ఆంధ్రుల సంస్కృతిలో ఉంది. నృత్య సంగీతాలను శాతవాహనుల కాలమునుండి అన్ని రాజ వంశాలు పోషించి ఆదరించాయి పూర్వం జీవించి, కాలాన్ని అధిగమించిన సంగీత, నాట్య కళామ తల్లులు, ఆకాలానికి శోభనిచ్చి చరిత్రలో చిరస్థాయిగా నిలిచిన వారెందరో ఉన్నారు చాళుక్యుల కాలములో చెల్లవ్వ,' చామకాంబలు, కాకతీయుల కాలములో 'మాచల్దేవి', విజయనగరాధీశుల ఆస్థానంలో రంజకం' కుప్పాయిలు గోల్కొండను పాలించిన అబ్దుల్లా కుతుబ్‌షా కాలంలో తారామతి, ప్రేమామతిలు ఆకాలాన్ని తమ సంగీతనాట్యాభినయులతో, తమ ప్రజ్ఞాపాటవాలతో, జనవాహినిని ఆనంద డోలికలలో ముంచెత్తించారు. చరిత్రలో సంగీత నాట్యకళలకు శాశ్వితత్వం కల్పించారు

గోల్కొండను పాలించిన 'మహ్మద్ కులీ కుతుబ్‌షా' (1580 -1612) కాలములో ఎందరో సంగీత, నాట్యకళాకారులు, కారిణులు జైపూర్, ఆగ్రా బురహన్‌పూర్, అహ్మదాబాద్, కాబూల్, లాహోర్, లక్నోలనుంచి వచ్చి ఇచ్చట స్థిరపడ్డారు, కళలను ప్రచారం చేస్తూ జీవితాల్ని గడిపారు

గోల్కొండను పాలించిన వారు ఇరాన్ రాజవంశానికి చెందినప్పటికి, చాలామంది ఇచ్చటి హిందూ స్త్రీలను వివాహం చేసుకొని వారిని, వారి సంతానాన్ని గౌరవించారు ఇబ్రహిం కుతుబ్‌షా హిందూ స్త్రీ అయిన భాగీరథీని వివాహం చేసుకొన్నాడు వారి పుత్రుడు మహ్మద్‌కులీ కుతుబ్‌షా అతని భార్య హిందు స్త్రీ' యే వారి కుమార్తె హయ్యత్ భక్షిబేగం ఆమె కుమారుడు అబ్దులాకుతుబ్‌షా ( క్రీ శ. 1614 - 72) ఇతడు ఇద్దరు హిందూ స్త్రీలను, సంగీత నాట్య కళాకారిణులను ఆదరించి, గౌరవించాడు వారే తారామతి, ప్రేమామతిలు వారి పేరిట రెండు గ్రామాలు తారామతి పేట, ప్రేమామతి పేటలు కట్టించాడు అవి నేటికి నిలచి ఉన్నాయి

రెండు నాట్య, సంగీత మందిరాలను కూడా వారికొరకు నిర్మించాడు అవి నేటికి నిలిచి ఆనాటి రసజ్ఞతను, కళాభిమానాన్ని తెలియజేస్తున్నాయి

నన్నెచోడుని కాలములో, రెడ్డి రాజుల కాలములో వసంతోత్సవాలు జరిగేవి. ఆ సందర్భంలో సంగీత నాట్య ప్రదర్శనలు దేశదేశాల కళాకారులతో ప్రదర్శింప బడేవి. విజయనగర రాజులు మహర్నవమి ఉత్సవాలు జరిపేవారు. అదే విధంగా అబ్దుల్లాకుతుబ్‌షా కాలములో 'ముతరాషి' ఉత్సవాలు అతివైభవంగా నిర్వహింపబడినవి. సంగీత నాట్య కళాకారులను అన్ని ప్రాంతాలనుండి రావించి, వారి ప్రదర్శనలు ఏర్పాటు చేసేవారు ఆనాటి ఉత్సవాలలో అబ్దుల్లా కుతుబ్‌షా, మొట్టమొదట సారిగా ఒక దేవాలయ ప్రాంగణములో ఆరాధనా నృత్యం చేస్తున్న తారామతి, ప్రేమామతులను చూచాడు. వారి నృత్యానికి ముగ్ధుడయ్యాడు వారిని రాజనర్తకులుగా చేస్తానన్నాడు. రాజాస్థానికి వచ్చి నాట్యంచేయమని కోరాడు. వారు నిరాకరించారు. దానికి కారణం ఉంది.

ప్రాచీన కాలములో నృత్య సంప్రదాయంలో, నట్టువ మేళ సంప్రదాయం, నాట్య మేళ

---

★ **కె. జితేంద్ర బాబు** అడ్వొకేట్, హైదరాబాద్

సంప్రదాయం అనే రెండు సంప్రదాయాలు ప్రచారంలో ఉండేవి. నట్టువ మేళ సంప్రదాయం పూర్వకాలములో దేవదాసీ సంప్రదాయం, రాజనర్తకీ సంప్రదాయం అని రెండు విధాలుగా పాటింపబడెడిది దేవదాసి సంప్రదాయం వారు ఆరాధనా నృత్యాలను కేళికా నృత్యాలను చేసేవారు దేవాయంలో స్వామిసన్నిధిలో జరిగే నృత్యానికి, ఆరాధనా నృత్యమని, కళ్యాణ మంటపంలో జరిపితే కేళికానృత్యమని పేరు రాజనర్తకీ సంప్రదాయం కూడా మార్గి దేశి అని రెండు విధాలుగ చేసేవారు.

**నృత్యాన్ని కూడా**

శ్లో॥ ''నృత్యం తత్ర నరేన్ద్రాణా మభిషేక మహూత్సవే
యాత్రాయాం దేవ యాత్రాయాం వివాహే ప్రియ సంగమే
నగరాణా మగరాణాం ప్రవేశే పుత్ర జన్మని
శుభార్థిభిః ప్రయోక్తవ్యం మాఙ్గళ్యం సర్వకర్మసు''

అని 'అభినయ దర్పణం'లో నందికేశుడు' ఏ ఏ సందర్భాలలో చేయాలో నిర్దేశించాడు పట్టాభిషేకం, తిరునాళ్ళు, ఉరేగింపు, దేవతోత్సవాలు, వివాహము, ప్రియసంగమము, పురప్రవేశం, గృహ ప్రవేశం, పుత్రోత్సవం మొదలైన సందర్భాలలోనే శుభాన్ని కోరే వారు నృత్యాన్ని చేస్తారని నిర్దేశించాడు.

నాట్య మేళ సంప్రదాయం వారు కూచి పూడి లేక ఇతర భాగవతులు లేక కలాపాలు జరిపేవారు. వీరు వీధి నాటకాలు, నృత్యనాటకాలు దైవసంబంది, రాజ సంబంధి ఆడెడివారు, గోల్కొండ రాజుల కాలములో వీరు సంచారం చేస్తూ ప్రదర్శనలిచ్చేవారు

దేవాలయంలో ఆరాధనా నృత్యము చేసేవారు రాజాస్థానాలలో నాట్యం చేయరు. రాజనర్తకిలను దేవాలయంలో ఆరాధనా నృత్యం చేసే అర్హత అనాడు ఉండేదిగాదు. ఈ తారామతి, ప్రేమామతిలు దేవాలయాలలో ఆరాధనా నృత్యాలు చేసే సంప్రదాయానికి చెందిన వారు వారిని క్రీ.శ. 1630లో జరిగిన 'ముతరాషి' ఉత్సవాల సందర్భంలో చూచిన అబ్దుల్లా కుతుబ్‌షా వారిని రాజాస్థానానికి వచ్చి నాట్యం చేయమనికోరగా వారు నిరాకరించారు వారి సంగీత నాట్యాలకు ఆకర్షితుడైన అబ్దుల్లా కుతుబ్‌షా వారి కోసం వారి కోరికపై ప్రత్యేక నాట్య సంగీత మందిరాలను, విశాల ప్రదేశంలో గొల్కొండ ఖిల్లాకు దగ్గరగా ఉద్యానవనంలో వారిపేరున నిర్మిస్తే వారు నాట్యం చేస్తామన్నారు. వారి కోరిక పై రెండు నర్తనాగారాలను నిర్మించటం జరిగింది. 'మిసిమి' మొదటి చివరి అట్టలను అలంకరించిన 'తారామతి', ప్రేమామతిల చిత్రాలు ఆనాడు అబ్దుల్లా ఖుతుబ్‌షా చిత్రకారుల చేత చిత్రీకరింపజేసినవి. ఆ చిత్రాలు ఈనాటికి చెక్కు చెదరక ఆనాటి జీవన శైలిని ప్రతిబింబిస్తూ వాటిలోలో సుందరంగా ఉన్నాయి.

స్వర ప్రాధాన్యతగలది సంగీతము. భావాత్మకమైనది సాహిత్యము, రసాత్మకస్వరసంచారమున్నది రాగం. సంగీత, సాహిత్య అభినయాల సమ్మేళనాలతో ఆనాటి కాలాన్ని అనంద డోలికలలో ఊగించి జీవితాల్ని ధన్యం చేసుకొన్న రసజ్ఞ జీవులు తారామతి ప్రేమామతులు. అంగీకాభినయాలతో

భావాలను వ్యంజనం చేసే నర్తనమే నృత్యం సర్వాభినయు వర్జితమె, వక్ష్య మాణమగు అంగోపాంగ ప్రత్యంగ సహితగాత్ర విక్షేప మాత్రమగు నర్తనమే నృత్యం సాత్వికాభినయ భావాలలో నిండి రసాశ్రయమై వాక్యార్థాన్నభినయించునది నాట్యం. నృత్యాలు, గీతాలు, వాయిద్యాలు కలిస్తేనే దౌర్యత్రికాత్మక' సంగీతం ఏర్పడుతుంది ఆ సంగీతాన్ని సాధన చేసిన తారామతి, ప్రేమామతిలకు శాశ్వతత్వం కల్పించడానికి అబ్దుల్లా కుతుబ్‌షా చేసిన ప్రయత్నమే తారామతిపేట, ప్రేమామతి పేటలు, నృత్యగాన మందిరాలూ. నృత్త లాస్య దర్శన విశారద శారదలైన తారామతి ప్రేమామతుల దశవిధలాస్యాలు కనపడక పోయినా, వారి పాదమంజీరధ్వనులు వినపడకపోయినా, అనాడు వారికొర్కై నిర్మించిన నర్తనాగారాలు ఆనాటి వారి ఆనంద నృత్యానికి ప్రతీకలుగా నిలిచే వున్నాయి

అబ్దుల్లా కుతుబ్‌షా తాను నిర్మించిన నాట్య గానశాలలో నిరంతరం వీణా నిక్వాణంతోను, వివిధ నృత్యగానాదులతోనూ, మృదంగ ధ్వనుల వాద్య వినోదాలతో నిత్యచిరుగజ్జెల నినాదాల, వినోదాలతో తారామతి, ప్రేమామతిల ప్రేమా సద్బుశ్యుడై కాలం గడిపిన అబ్దుల్లా మరణంతో గోల్కొండలో ఆటా పాటా అగింది, నిత్యోత్సవం ముగిసింది నర్తనాగారాలు మూగపోయినాయి. ఆనాడు ఆనర్తనాగారాలపై నిత్యం ప్రదర్శనలు జరిగినట్లు ''గోల్కొండేకెతాలూఖాత్'' అను గ్రంథం వల్ల తెలుస్తుంది. సంగీత సాహిత్య నాట్య విద్యల మర్మాన్నెరిగి, సారాన్ని గ్రోలిన రసాస్వాధనాకోవిదుడు కనుకనే అబ్దుల్లా ఆకళాకారులను ప్రేమించి మరణించిన తన పక్కనే శ్మశానవాటికలో స్థానమిచ్చాడు. కళలుపై తనకు గల అబిమానాన్ని చాటుకున్నాడు.

ప్రేమామతి అబ్దుల్లా ఖుతుబ్‌షా కంటె ముందే క్రీ శ 1662 లో మరణించింది ఆమె సమాధిని గోల్కొండ రాజవంశీయులు మరణిస్తే నిర్మించే శ్మశాన వాటికలో సమాధుల ప్రక్కనే నిర్మించి, సమాధిపైన నిర్మించిన మందిరంపై పార్శీ కవితలను శిల్పించి, తన కవితా హృదయం చాటుకున్నాడు. ఆమెపై తనకు గల 'ప్రేమ'ను చాటటానికి ఆమె సమాధిపై అబ్దుల్లా శిల్పించిన From all eternity Premamati was a flower of Paradise అనే భావం స్ఫురింప జేసే పార్శీ చరణయే చాలు

ఇలా రాసే విధానాన్ని 'నాస్తలిక్' (Nastaliq) అంటారు. గోల్కొండరాజ వంశానికి చెందిన స్త్రీలు మరణించినపుడు మాత్రమే ఇలా సమాధులను నిర్మించి శిల్పించుతారు. మొత్తం గొల్కొండ సమాధులను పరిశీలించినట్లయితే రాజకుటుంబానికి చెందిన వేరొక సమాధి పైన కూడా ఇలా లిఖింపబడింది. ఆ సమాధి (Nekham Khan) కు చెందినది. అబ్దుల్లా ఖుతుబ్‌షా (క్రీ.శ. 1672) మరణించటానికి ముందే తన సమాధిని ప్రేమామతి సమాధిప్రక్కన నిర్మించుకొన్నాడు. తర్వాత తారమతి మరణించింది. ఆమె సమాధికూడా అబ్దుల్లా కుతుబ్‌షా సమాధి ప్రక్కనే నిర్మింపబడి ఉంది.

అబ్దులా కుతుబ్‌షా, తారామతి, ప్రేమామతిలు హిందూ ముస్లింల ఐక్యతకు. సంస్కృతీ, సంప్రదాయాల అనుసంధానానికి ప్రతీకలు. వారి పేరున నిర్మించిన నాట్య మందిరాలను పర్యాటక కేంద్రాలుగా మార్చాలని, సంగీత, నాట్య సాంస్కృతిక కేంద్రాలను స్థాపించాలని ప్రయత్నిస్తున్న మిత్రులు. కళాతపస్వి, భరతకళా ప్రపూర్ణ నటరాజరామకృష్ణగారి ప్రయత్నానికి అభినందనలు.

# ''రెండో 'చీకటి' యూరప్ శిశువును''

## నోబెల్ బహుమతి ఉపన్యాసం, 8, డిసెంబర్ 1980

అనువాదం : బి. వెంకటరామిరెడ్డి ★ — జెస్లా మీ-వోష్

జీవితాన్ని భగవంతుని వరప్రసాదమనీ, ముందుగా 'ఇదీ' అని చెప్పడానికి వీలుకాని సంక్లిష్టమైన అద్భుతమనీ పొగిడేవారికి ఇక్కడ, ఈ కమిటీలో, నా ఉనికి వాదనకు ఆస్కారమివ్వాలి. నేను స్కూల్లో చదువుకునే రోజుల్లో, అప్పుడు పోలెండులో ప్రచురించబడిన ''నోబెల్ బహుమతి గ్రహీతల లైబ్రరీ'' లోని భాగాలను చదువుతా ఉండేవాణ్ణి. ఇప్పటికీ ఆ పుస్తకాల్లోని అక్షరాలూ, కాయితాల రంగూ, ఆకారమే బాగా గుర్తున్నాయి. ఆరోజుల్లో నోబెల్ బహుమతి గ్రహీతలంటే లావుగా పెద్దగా ఉండే పుస్తకాలు వ్రాసేవాళ్ళని అనుకునేవాణ్ణి. వాళ్ళలో కవిత్వం వ్రాసేవాళ్ళు కూడా ఉన్నారని తెలిసినప్పుడూ, అదే అభిప్రాయాన్ని వొదుల్చుకోలేకపోయాను 1930లో యూనివర్శిటీ రివ్యూలో నా మొదటి కవితలు ప్రచురించబడినప్పుడు రచయితను కావాలని ఉబలాటపడలేదు. చాలాకాలం తరువాత ఫ్రాన్సులోనూ, అమెరికాలోనూ ఉంటున్నప్పుడు, పోలిష్ భాషలో కవిత్వం వ్రాయడం అనే విచిత్రమైన వృత్తిని ఎన్నుకున్నప్పుడు, 'కవి' అంటే ఒక ఆదర్శవ్యక్తిగా ఉండాలని వాంఛించాను. కవిగా కీర్తి ప్రతిష్ఠలు సాధించుకోవాలనుకునేవాడు ముందుగా తనపుట్టిపెరిగిన గడ్డమీద ప్రసిద్ధుడు కావాలి

బాల్యంలోనేను చదివిన నోబెల్ బహుమతి గ్రహీతలలో ఒకరు కవిత్వం విషయంలో నాభావాలను ప్రభావితం చేశారు. ఆమె సెల్మాలా జెర్లోఫ్. ఆమె వ్రాసిన ''వండర్‌ఫుల్ అడ్వెంచర్స్ ఆఫ్ నీల్స్'' అనేపుస్తకం నాకు ప్రేమాస్పదమయింది. ఆ పుస్తకంలో ఆమె తన కథానాయకుడికి ద్విపాత్రాభినయం చేయవలసిన స్థితిని కల్పిస్తుంది. ఆ కథానాయకుడు ఆకాశాన్నించి భూమిని చూస్తూ, ప్రతి చిన్నవిషయాన్నీ నిశితంగా పరిశీలిస్తాడు. ఈ ద్వైధీయ పరిశీలన కవి తన భావావేశాన్ని వ్యక్తపరిచేందుకుపయోగించిన ఉత్ప్రేక్షకావొచ్చు. అదేరకమైన ఉత్ప్రేక్షను 17వ శతాబ్దపు లాటిన్ కవి మాసియెజ్ సర్బీవ్స్కీ ఉపయోగించాడు. 'కాసిలిందె' అనే పేరుతో అతను యూరోప్ అంతటా ప్రసిద్ధుడు. అతడు మా విశ్వవిద్యాలయంలో కవిత్వం బోధించాడు. అతడు తన 'ఓడ్'లో పెగాసస్ మీద విల్నో నుండి ఆంటెవెర్ప్ వరకు, తన కవి మిత్రుల్ని కలుసుకునేందుకు చేసిన సముద్రయానాన్ని వర్ణించాడు. నీల్స్ లాగా అతనుకూడా నదుల్ని, సరసుల్ని, అడవుల్ని వర్ణిస్తాడు. అతడు వర్ణించిన దృశ్యం ఎంత సుదూరమో అంతదగ్గరగా అనిపిస్తుంది. కవిత్వం వ్రాయడం అంటే 'చూడడమూ, చూసింది వర్ణించడమూ' అని నమ్మేవారు అతడు ఆధునికతతో విభేదిస్తున్నాడనీ, కవిత్వపు భాషనుగురించి ఉన్న అనేకానేక సిద్ధాంతాలతో ఆకర్షితులైనవారిమీద యుద్ధం ప్రకటిస్తున్నాడనీ గ్రహించాలి.

ప్రతికవీ తనకుముందు తరతరాలుగా తనభాషలో రచనలు చేసిన రచయితల, కవుల శైలినీ, కళాత్మకతనూ వారసత్వంగా తీసుకుంటాడు. అంతేగాక తనముందు తరాలవారి ఆవిష్కరణా విధానాలు తన భావాలను వ్యక్తీకరించేందుకు చాలవనీ గ్రహిస్తాడు. ఆవిష్కరించేప్పుడు అతడు తన అంతర్వాణిని వింటాడు. ముసుగుల్నీ, వేషాల్నీ అది అంగీకరించదని తెలుసుకుంటాడు. అయితే ఆ పాతకాలపు భావవ్యక్తీకరణ పద్ధతులమీద తిరుగుబాటు చేసేప్పుడు తన సమకాలీనులూ,

---

★ **బి. వెంకటరామిరెడ్డి** విజయవాడ సిద్ధార్థ సైన్స్ & ఆర్ట్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

సమకాలీన ఉద్యమాలమీద ఆధారపడతాడు మొదటి సంకలనాన్ని ప్రచురించాక తను ఎవరినో అనుసరించి వారివలలో చిక్కుకున్నట్టు తెలుసుకుంటాడు. తన మొదటి సంకలనం చాలా వ్యక్తిగతం అనుకుంటుండగానే తన మరొకరి శైలిలో చిక్కుకున్నట్టు గ్రహిస్తాడు. తప్పించుకునే మార్గం ఒక్కటే- తనదైనమార్గాన్నివెదుక్కోవడం. రెండో పుస్తకం వెలుగు చూశాక చూసుకుంటే, మళ్ళీ మొదటి పరిస్థితే! ఇంక దానికి అంతం లేదు. అలా అనుకరణ నుండి తప్పించుకునే ప్రయత్నంలో, గతాన్నించి ముందుకు సాగే యత్నంలో అతనికి నోబెల్ బహుమతి వొస్తుంది!!

తను సాధించిన, పూర్తిచేసిన వాటిలో అర్థం కాని అంతర్మథనం అతనిని నిలువనీయదు. ఇది 'వాస్తవాన్ని' తెలుసుకోవాలనే తపనయొక్క ఫలితం అనుకుంటాను. అయితే ఆమాటకు తాత్త్విక పరమైన ఏ అర్థాల్నీ ఆపాదించి ఉపయోగించలేదు. అది 'నీల్స్' భూమిని తోటవెనుకనుండి చూడడం, ఆ లాటిన్ ఓడ్ వ్రాసినకవి పెగాసస్ వెనకనించి చూడడం. భూమియొక్క సౌందర్యసంపదలు ఎందరు ఎన్ని విధాలుగా వర్ణించినా తరిగిపోవు. అలా అనుకోవడం అంటే మనం ప్రస్తుతం వేసుకుంటున్న - ''అసలు వాస్తవం ఏమిటి?'' - అనే ప్రశ్నను అంగీకరించక పోవడమే అంటే అది పోంటియస్ పిలేట్ వేసిన ''సత్యం అంటే ఏమిటి?'' అనే ప్రశ్నలాంటిదే. ద్వంద్వాల్లో మనం ఉపయోగించేవాటిలో జీవమూ-మృత్యువూ అనే దానికి అదే ప్రాధాన్యత ఉంది. అలాంటివే సత్యం - అసత్యం; వాస్తవం - భ్రమ.

II

సిమోన్ వీల్ రచనలకు నేను చాలా ఋణపడి ఉన్నాను. అతనంటాడు ''దూరం కవిత్వానికి ఆత్మ'' అని. అయితే ఈ దూరాన్ని ఉంచుకోవడం అసాధ్యం. నా ''ఎ చైల్డ్ ఆఫ్ యూరోప్'' అనే కవితలో ఈ విషయాన్నే వ్యంగ్యంగా వొప్పుకున్నాను. అదే టైటిల్ తో నేను ఆత్మకథకూడా వ్రాసుకున్నాను నిజానికి యూరోప్ ఒకటికాదు, రెండు యూరోపులున్నాయి. మేమంతా రెండో యూరపులో నివశిస్తున్నాం; 20వ శతాబ్దపు చీకటి గుండెల్లోకి దిగిపోవలసిన వాళ్ళమయ్యాం. కవిత్వాన్ని గురించి ఎలామాట్లాడాలో నాకు తెలియదు కవిత్వాన్ని గురించి నిక్కచ్చిగా మాట్లాడవలసివస్తే, కాలంతో, దూరంతో విచిత్రమైన పరిస్థితుల్ని అది ఎలా ఎదుర్కుంటుందో మాట్లాడవలసి ఉంటుంది. ప్రస్తుతం మనం ఒక కోణం నించి సంఘటనలను, విషయాలను గుర్తిస్తున్నాం. అవి మృత్యువును భరించే దగ్గర్నించి అన్ని ప్రాకృతిక విలయాలను మీరుతున్నవి. అయితే కవిత్వం - నాదీ, నా సమకాలికులదీ, వారసత్వంగా తెచ్చుకున్నదీ లేదా సాధించుకున్నదీ అయిన శైలి - ఈ విషాదాలను ఎదుర్కోలేకపోతున్నది (గుడ్డివాళ్ళలాగ మేము మాదారిన ముందుకు సాగినాము; మాకాలానికి సంబంధించిన ఎన్నో మానసిక భ్రమలకు శోధనలకు గురయ్యాం.

భ్రమకూ వాస్తవానికీ మధ్య తేడాను గుర్తించడం అంత సులభమేమీకాదు. రెండు శతాబ్దాలనుండి ప్రారంభమైన గొప్పమార్పుల మధ్య మనం నివశిస్తున్న ఈ రోజుల్లో అది మరీ కష్టతరం. ఈ మార్పులు యూరో - ఆసియా ఖండానికి చెందిన ఒకచిన్న పశ్చిమ ద్వీపంలో ప్రారంభమై ఒక జీవితకాలంలోనే మొత్తం భూగోళాన్ని ఆక్రమించాయి. అందరినీ శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాలను పూజించేట్టు చేశాయి. యూరపుకు చెందిన ఆయాప్రాంతాల్లో మనుషుల మీద పెత్తనం అనేది పతనమౌతున్న రోజుల్లో, మేధోసంబంధమైన అనేకానేక శోధనల్ని తట్టుకోవడం కష్టతరమైన విషయం. ఇవి ప్రకృతిమీద పెత్తనం చెలాయించడం లాంటివే. అందువల్లనే విప్లవాలు, యుద్ధాలు, లక్షలాది ప్రాణుల శారీరక ఆత్మగత సర్వనాశనానికి దారితీశాయి. మేము సాధించింది వీటికి

సంబంధించిన జ్ఞానాన్నివ్వడమేకాదు, ప్రజలను అంతర్ పతనాన్నించీ, కఠిన పెత్తనానికి తలవొంచడంనించీ రక్షించే విషయాలను తెలియజేయడమే!

అందువల్లనే మేము కొన్ని జీవనవిధానాల, సంస్థల, దుష్టశక్తుల కోపానికి లక్ష్యాలయ్యాము. అన్నిటికంటె ముఖ్యంగా మానవసంబంధాలు, కుటుంబాలు, మతం, ఇరుగుపొరుగుతనం, కామన్‌వారసత్వం వాటికోపానికి లక్ష్యాలయ్యాయి అరాచకం, అరాచక మానవలక్షణాలు, చర్చి సంబంధాలు, తలవొంచడాలు అర్థంలేనివిగా ముద్రవేయబడ్డాయి. చాలా దేశాలలో అనూచానంగా వొస్తున్న తరతరాల బంధాలు చెరిపివేయబడ్డాయి. వారు ఆ బంధాలనుండి దూరం చేయబడ్డారు అలాంటి పరిస్థితుల్లోనే రక్షించగలవీ, జీవాన్నిచ్చేవీ అయిన విలువలు ఆవిష్కరించబడతాయి నా దేశస్థితీ అదే నేనూ, నా మిత్రులూ అలాంటివాటినే పొందగలిగినందుకు కృతజ్ఞతలు తెలియజేసుకోవాలి.

శతాబ్దాల నుండి ప్రకృతి వొడిలో అనేకానేక భాషలు మాట్లాడే అనేక మతాలకు చెందిన ప్రజలు నివసిస్తున్న చిన్న దేశంలో జన్మించడం అదృష్టం. నేనీమాట పురాణకథలకూ, కవిత్వానికీ ప్రసిద్ధిపొందిన 'లాధూనియా' దేశాన్ని మనసులో పెట్టుకొని అంటున్నాను ఫిన్లండులోని చాలాకుటుంబాలు స్వీడిష్ భాష మాట్లాడుతున్నట్టే మా కుటుంబంలో 16వ శతాబ్దంనించే పోలిష్ భాష మాట్లాడుతున్నాము. అందుచేత నేను పోలిష్ కవినేకాని లిధూనియన్ కవిని కాను. అయితే లిధూనియాకు చెందిన మైదానాలూ, ఆత్మలూ నన్ను వొదిలిపెట్టలేదు. బాల్యంలో, స్కూల్లో, లాటిన్ సాహిత్య పదాలు వినడమూ, ఓవిడ్ ని అనువదించడమూ, రోమన్ కాథలిక్ సిద్ధాంతాల్లో శిక్షణపొందడమూ మంచిదే. మామూలు వ్యాపారపు బస్తీ అయిన 'విల్నో'లో స్కూలువిద్య, యూనివర్శిటీ చదువూ సాగించడం అదృష్టం. ప్రతిరాతిమీద చరిత్రగుర్తుల్ని అద్దుకుని, ఉత్తరారణ్యాలమధ్య 40 రోమన్‌కాథలిక్‌చర్చిలతో విలసిల్లుతున్న అలాంటి పట్టణంలో చదువుకోవడం మరుపురాని స్మృతి. ఆ రోజుల్లో యూదులు దీన్ని ''జెరూసలెం ఆఫ్ ది నార్త్'' అని వ్యవహరించేవారు. అమెరికాలో బోధించేప్పుడు నాకు తెలిసివొచ్చింది - మా ప్రాచీన విశ్వవిద్యాలయంనించీ, అక్కడా కంఠతా నేర్చుకున్న రోమన్‌న్యాయశాస్త్రంనించీ, చరిత్రనించీ, ప్రాచీన పోలెండ్‌దేశపు సాహిత్యాన్నించీ నేను ఏమి నాలోకి తీసుకున్నానో! వారి సహజలక్షణాయిన, అరాచకత్వం, ఏ పెత్తనానికీ లోబడనితనం, మార్పునుకోరే సంఘం కలిగి ఉన్న అమెరికన్ యువతరానికి ఇవి ఆశ్చర్యాన్ని కలిగించేవి.

అలాంటి ప్రపంచంలో పుట్టిపెరిగిన కవి వాస్తవాన్ని లోతైన ఆలోచనల్లోంచి గ్రహించాలని చూస్తాడు. ప్రాచీన వ్యవస్థ అతనికి ప్రియంగా ఉంటుంది. తోటివారినించి ఎలాంటి వొత్తిళ్ళు లేకపోవడం, చర్చిగంటారావం, ప్రశాంతమైన జీవితం అతనికి ప్రియంగా ఉంటాయి. ఒకవేళ పుస్తకాలున్నా అవి భగవంతుడు సృజించిన వస్తువులకు సంబంధించినవై ఉంటాయి. హఠాత్తుగా, ఇవన్నీ, చరిత్ర సృష్టించిన రాక్షసకృత్యాల్లో తుడిచిపెట్టుకుపోవడం - ఎంతదారుణం!

పైనించి కవి భూమిని చూసి పిలుస్తాడు. ఆ అగాధం నించి అతనికి భూమి పూర్తిగా కనిపించదు, వినిపించదు. ఏదో ఒక దురవగాహమైన స్థితి కనిపిస్తుంది. అదొక భయంకరమైన వాస్తవం. అది అతణ్ణి రాత్రింబవళ్ళు అశాంతికి గురిచేస్తుంది. అలాగ జీవితానికీ కార్యానికీ మధ్య ఉత్పన్నమైన సంఘర్షణ; సాటిమనుషులతో ఏర్పడ్డ ఘర్షణ; కళకీ సంఘటనకీ మధ్య ఏర్పడ్డ సంఘర్షణ అతణ్ణి అశాంతికి గురిచేస్తుంది. వాస్తవానికి ఒకపేరు వ్యక్తీకరణకు మాటలు

అవసరమౌతాయి అయితే ఇదంతా భరించరానిదిగా తయారౌతుంది కవి నోటిమాటగా ఏమీ అనలేడు కళ ఎప్పుడూ కార్యం ముందు దిగదుడుపే. అయితే వాస్తవాన్ని అంగీకరించడంలో మంచీ - చెడూ, ఆశా - నిరాశా లాంటి పాత బంధనాల మధ్య ప్రక్షిప్తమౌతుంది దానికంటే ఉన్నతమైన దూరంనించే వాస్తవాన్ని గ్రహించడం సాధ్యం అయితే అదొక విధమైన నీతి ద్రోహం.

నేరాలతో, హత్యలతో కాలుష్యమై, సంఘర్షణలతో నిండిన 20వ శతాబ్దాన్ని, ప్రధానంగా పరస్పర వ్యతిరేకమైన లక్షణాలతో నిండిన ప్రపంచాన్ని చూసి కవి రచనలు చేయవలసిన పరిస్థితి! అలాంటి ఒకానొక కవి ఆలోచనలు, గుర్తులుగా మిగిలిన అతని కవితలు ఎలా ఉంటాయి? తన కవితలన్నీ బాధాకరమైన వ్యతిరేకభావాల సంఘర్షణ అని తెలిసి వాటిని వ్రాయకుండా ఉంటేనే బాగుండేదని అనుకుంటాడు.

III

దేశ బహిష్కృతులైన కవులందరినీ, వాళ్ళు నివసిస్తున్న ప్రాంతాలలో వాళ్ళు గుర్తుచేసుకున్నప్పుడల్లా వొచ్చి, వాళ్ళను కలుసుకుని వెన్నుతట్టే కవితా పోషకుడు - డాంటే ఫ్లోరెన్స్‌ల సంఖ్య అందువల్లనే విపరీతంగా పెరిగిపోయింది ప్రతికవీ ఎప్పుడో అప్పుడు తను దేశబహిష్కృతుడే అని తెలుసుకుంటాడు. భాష, భావాల విషయంలో తనశక్తిని ఉపయోగించి పదాలను అర్థాలనించీ భాషను పదబంధాలనించీ విముక్తం చేస్తాడు బంధనాల్లో బందీ అయిన భాష, జాతియొక్క జీవపరమైన అలవాట్లను సంతరించుకుంటుంది. వాటికి పేరంటూ లేదు. కాబట్టి వేరువేరు వాస్తవాలంటూ ఉండవు. సాహిత్య సిద్ధాంతాలకూ, భాషకూ ఎదుగుతున్న ఏక పార్టీ రాజ్యానికీ ఏదో కనబడని ఉన్నట్టనిపిస్తుంది. పరిశోధనాత్మకమైన రచనలూ, కవితలూ సృజించడాన్ని అలాంటి రాజ్యవ్యవస్థ ఎందుకు భరించలేదో కారణం కనుపించదు. అలాంటి కార్యక్రమాలుకూడా రాజ్యవ్యవస్థ స్వయంగా చేయవలసినపనులే అనుకుంటుందనుకుంటాను కవి తనని తాను అరువుతెచ్చుకున్న శైలులనుండి బయటపడి వాస్తవంకోసం ఎదుర్కోవడంలో ఏం ప్రమాదముంటుంది? అందరూ అనుకుని కలిసికట్టుగా నిశ్శబ్దపు కుట్రలో ఒక గదిలో కూచుని ఉన్నప్పుడు, ఆ నిశ్శబ్దాన్ని భగ్నంచేసే ఒక్కసత్యవాక్యం తుపాకీ గుండులా ధ్వనిస్తుంది. అలాంటి ఒక్కమాటను ఉచ్చరించడం ఒక ఆపుకోలేని కండూతిలాంటిది అది అతణ్ణి ఏమీ ఆలోచించనీయదు అందుచేతనే కవి అంతర్ బహిర్ బహిషరణల్ని రెంటినీ ఎన్నుకుంటాడు. అతడుకేవలం వాస్తవాన్ని గ్రహించానికేగాక తన స్వేచ్ఛకోసం, ఇతరదేశాల్లో, దూరసముద్రతీరాల్లో కాస్సేపయినా జీవితాన్ని గురించిన ధ్యానంతో తన నిజమైన వృత్తిని సార్థకం చేసుకోవాలని చూస్తాడు.

అలాంటి ఆశ ఎండమావి. ఎందుకంటే అవతలి యూరోప్ నించి వొచ్చేవారు తాము ఎక్కడ ఉన్నా తమ అనుభవాలు ఎంతవరకు తమని తమ కొత్త కార్యరంగం విడదీస్తుందోనని చూస్తారు. మనం నివసించే భూగోళం అణ్వాయుధ ప్రగతివల్ల సంవత్సర సంవత్సరానికీ చిన్నదైపోతున్నది దాన్ని వివరించడం, ఇదీ అని చెప్పడం సాధ్యం కాదు. పూర్వపు శతాబ్దాలలో అధిక సంఖ్యాకులైన విద్యావిహీనులకు వారివారి దేశాల సంస్కృతుల చరిత్ర ఏమీ తెలిసేదికాదు ఆధునిక విద్యావిహీనుల మనసుల్లో చారిత్రకజ్ఞానం ఏ కొంచెం ఉన్నా అది అలుక్కుపోయింది. అందువల్లనే వారిలో అయోమయ స్థితి! నెపోలియన్‌కి మోలియర్, లెనిన్‌కి వోల్టేర్ అందువల్లనే సమకాలీనులైపోతారు

అంతేగాక పూర్వయుగాల ముఖ్యమైన సంఘటనలు, వాటికి సంబంధించిన జ్ఞానమూ, అజ్ఞానమూ రాబోయే తరాలవారికి నిర్ణాయకాలవుతాయి అవి దూరంగా జరిగి, వెలిసి, స్థిరత్వాన్ని

కోల్పోతాయి. యూరోపియన్ నిహిలిజాన్ని గురించి 'నీషే' చెప్పిన భవిష్యవాణిని ఈ సందర్భంలో గుర్తుచేసుకోవాలి - ''నిహిలిస్టు కన్ను తన స్మృతులకి అపనమ్మకాన్ని కలిగిస్తుంది. అదివారి స్మృతుల్ని ఆకుల్లాగ రాల్చేస్తుంది. తనకి తానే ఏమీ చేసుకోలేని అతను గతయుగాల మానవాళికి ఏంచెయ్యగలడు? అందుకే వాటినలా రాలిపోనిస్తాడు ''

ప్రస్తుతం మనం గతాన్ని గురించిన కల్పితగాథలతో చుట్టుముట్టబడి ఉన్నాం. ఇది మంచి చెడు విచక్షణకు సంబంధించిన మామూలు జ్ఞానానికి వ్యతిరేకమైనది. అది ''లాస్ ఏంజిలీస్ టైమ్స్'' లో చెప్పబడ్డట్టు - చాలా భాషల్లో వ్రాయబడ్డ చాలాపుస్తకాలు మారణహోమం జరగనేలేదనీ, అదికేవలం యూదులు సాగించిన అబద్ధపు ప్రచారమనీ అన్నట్టుంటుంది అలాంటి మతి భ్రమణం సాధ్యమైనపుడు పూర్తి మతిమరుపూ సాధ్యమేకదా! అలాంటిది జెనెటిక్ ఇంజనీరింగ్‌కన్న, ప్రకృతి పరిసరాలను విషపూరితం చేయడంకన్నా ఎక్కువ ప్రమాదకరం.

అవతలి యూరపుకు చెందిన కవికి మారణహోమాలు వాస్తవాలు. అంతదగ్గరగా జరిగిన ఆ అనుభవాల స్మృతులనుండి అతడు తప్పించుకోలేడు - డేవిడ్ రచించిన 'సామ్స్'ని అనువదిస్తే

ప్రపంచం మారణహోమాలయొక్క అర్థాన్ని కొద్దికొద్దిగా మార్చుకుంటున్నప్పుడు; ఆ మాటకు అర్థం యూదుల చరిత్రకు మాత్రమే అన్వయిస్తున్నప్పుడు; మిగిలిన పోల్స్, రష్యన్లు, ఉక్రేనియన్లు, ఇతరదేశాల ఖైదీలసంగతి పట్టనప్పుడు; చరిత్ర టి.వి తెరమీద దృశ్యం దశకు దిగజారినపుడు; వాస్తవం ప్రాచీన భాండాగారాల్లో సమాధి చేయబడినపుడు కవి ఉద్వేగభరితుడౌతాడు ఇంత దగ్గరి వాస్తవాలు కూడా H G వెల్సు 'టైమ్‌మెషీను' లోని దృశ్యాల్లాగ నమ్మదగనవిగా మారిపోతాయి.

మారుతున్న సాంకేతిక పరిణామాలతో కదలిపోతూ ప్రపంచమంతా ఏకత్వాన్ని సాధించబోతున్నదని గ్రహిస్తాం. ''లీగ్ ఆఫ్ నేషన్స్'', ఐక్యరాజ్యసమితి ఆవిర్భావదినాలు గుర్తుంచుకోదగినవి. వాటితోబాటు, విషాదదినంగా గుర్తుండే రోజు 23 ఆగస్టు 1939. ఆరోజు ఇద్దరు నియంతలు తమచుట్టూ ఉన్న దేశాలను తామిద్దరిమధ్య పంచుకునేందుకు రహస్య వొప్పందం కుదుర్చుకున్నారు. తత్ఫలితంగా భయానకమైన యుద్ధం ప్రారంభమయింది. అంతేకాదు, దేశాలను కూడా సంతలో పశువుల్లాగ కొనుక్కోవచ్చు అమ్ముకోవొచ్చుననే సిద్ధాంతాన్ని వెలుగులోకి తెచ్చింది వాటి సరిహద్దులు, వాటి స్వయం నిర్ణయాధికారాలు అన్నీ తుడిచిపెట్టబడ్డాయి. ఆ నియంతలు నలభై సంవత్సరాల క్రిందట ఆ సిద్ధాంతాన్ని ఎలా పాటించారా అని ఇవాళ ప్రజలు నోటి మీద వేలుంచుకుని గుసగుసలాడుతున్నారు.

పౌరహక్కుల్ని కాలరాయడం దేశాలమధ్య స్నేహబాంధవ్యాలను నాశనం చేస్తోంది. పోలిష్ కవితాసంకలనాల్లో నా గతించిన మిత్రులు - ' వ్లాడి స్లా సెబిలా', 'లేక్‌పివోవార్' ల కవితల్ని ప్రచురిస్తూ, వారు 1940లో మరణించినట్టు వ్రాస్తుంటారు పోలెండ్‌లో ప్రతివొక్కరికీ వాళ్ళెలా చనిపోయారో తెలుసు. ఆరోజుల్లో, హిట్లర్ అనుయాయులు, ఆ కవులనే కాదు, వేలాది మంది పోలిష్ ఆఫీసర్లని ఎలా నిరాయుధుల్ని చేసి నిర్బంధించారో, ఒకే గోరీలో సామూహికంగా ఖననం చేశారో అందరికీ తెలుసు. నేటి యువతరానికి చరిత్రను అధ్యయనం చేసే అలవాటనేది ఉంటే, ఆ అనుయాయులే 'వార్సా' పట్టణంలో 1944లో 2 లక్షలమందిని ఎలా చంపేశారో తెలుస్తుంది.

ఆ మారణ హోమాన్ని సృష్టించిన ఆ నియంతలిద్దరూ ఇప్పుడు లేరు. అయినా, వాళ్ళ

సైన్యాలు లేకపోయినా, వాళ్ళిప్పుడుకూడా కనుపించని విజయాలను అదృశ్యంగా సాధించడంలేదని ఎవరనగలరు? అట్లాంటిక్ శాసనం ప్రకారం దేశాలు జూదం ఆటలో పావులూ పేకముక్కలూ కాకపోయినా, వ్యాపారవస్తువులయ్యాయన్న విషయాన్ని రెండు భాగాలుగా విభజించబడ్డ యూరోప్ తెలియజేస్తున్నది ఐక్యరాజ్యసమితిలో మూడు బాల్టిక్ దేశాలకీ సభ్యత్వం లేకపోవడం, ఆ యిద్దరు నియంతల వారసత్వాన్ని గుర్తుచేస్తున్నది యుద్ధానికి ముందు ఆ దేశాలు 'లీగ్ ఆఫ్ నేషన్స్' లో సభ్యులు. 1939లో జరిగిన రహస్యవొప్పందం ప్రకారం అవి యూరోప్‌నించి తొలగించబడ్డాయి.

బాధించే గాయాన్ని మళ్ళీ గుర్తుచేసి బాధిస్తున్నందుకు క్షంతవ్యుణ్ణి వాస్తవాన్ని గురించి మాట్లాడేప్పుడు అలాంటివాటిని గురించి మాట్లాడకతప్పదు ''థూసిడైడీస్''ని చదవడంకన్నా ప్రజల అర్జీలు, ఒప్పందాల్ని చదవడం చాలా దగాకోరుతనంగా అనిపించవొచ్చు. కాని, ఆకునిగురించీ, సముద్రంమీది సూర్యోదయ సూర్యాస్తమయాల సౌందర్యాన్ని గురించే కాదు - కార్యకారణాల గురించి చదవడం కూడ అత్యవసరమే. ప్రకృతి, చరిత్ర - ఏదైనా సరే, దాగి ఉన్న వాస్తవాన్ని, దురవగాహమైన విషయాల్ని తెలుసుకోవాలనే తపనే! కళకీ, శాస్త్రానికీ మూలశక్తి అదే ఒక్కోసారి అవతలి యూరోప్ మీద వొత్తిళ్ళను నేను కళ్ళముందు చూస్తున్నట్టే అనిపిస్తుంది అమెరికా కొంచెం కొంచెంగా దాన్ని స్వంతం చేసుకుంటున్నట్టుంటుంది.

గాయాలకన్నా బాగా గుర్తుండేవేవీ ఉండవు బైబిలు మనకు బోధించేది అదే. యూరోపుదేశాల శాశ్వతత్వం సాధ్యమని అనిపించిన పుస్తకం - బైబిలు.

విదేశాలలో గడిపిన ముప్ఫై ఏళ్ళలో, మా పాశ్చాత్య సహోధ్యాయులైన రచయితలూ సాహిత్యఅధ్యాపకులకన్న నేనే అదృష్టవంతుడననుకున్నాను కారణం ప్రాచీన, ఆధునికసంఘటనలు నా మెదడుకు పదునుపెట్టాయి. పాశ్చాత్య పఠితలూ, ప్రేక్షకులూ పోలెండ్, చెకోస్లోకియా, హంగరీకి చెందిన కవితలు, నవలలు చదివారు, అక్కడ తీయబడ్డ సినీమాలు చూశారు. తద్వారా అక్కడ నిరంతరమూ లోపాలను అధిగమించి ముందుకీ, ఔన్నత్యానికి సాగే ప్రయత్నాల సంఘర్షణనీ అర్థం చేసుకుని ఉంటారు. ఆరకంగా స్మృతి మనశక్తి గోడనో చెట్టునో ఆసరాగా చేసుకుని పాకేతీగలాగ, మనకు ఆసరా

కొద్దినిమిషాలక్రితం వైరుధ్యాలను అంతంచేయాలన్న తపనను వెలిబుచ్చాను. వైరుధ్యం కవికి అవసరమైన దూరాన్ని, తనతోటి మనుష్యులతో ఐక్యతను దూరమయ్యానన్న భావాన్ని వ్యతిరేకిస్తుంది. అయినప్పటికీ, భూమినించి ఉన్నతమైన దశకు వెళ్ళినప్పుడు కవి చరిత్రకు సంబంధించిన బంధాలకు అతీతుడౌతాడు. ఉన్నతంగా ఉంటూనే భూమికి సంబంధించిన ప్రతి చిన్నవిషయాన్నీ చూడడం ఎలా? అయినప్పటికీ, కాలం సృష్టించిన దూరాల్ని అధిగమించి, వ్యతిరిక్తాల మధ్య సామరసాన్ని సాధించడం సాధ్యమే. ''చూడడం'' అంటే కేవలం కళ్ళతో చూడడమేకాదు, చూసినదాన్ని స్మృతిలో ఉంచుకోవడం, 'చూడడం'' అంటే కేవలం కళ్ళతో చేడడమేకాదు, చూసినదాన్ని స్మృతిలో ఉంచుకోవడం. 'చూడడం, వర్ణించడం' అంటే భావనను పునర్నిర్మించుకోవడమే. కాలం సంఘటనలను, మైదానదృశ్యాలను, మానవాకారాలను నీడలుగా మార్చకూడదు. అందుకు విరుద్ధంగా అది, ప్రతిసంఘటనను తారీఖును, మానవుణ్ణి మానవుడిగా కాకుండా చేసిన ప్రతివిషయాన్నీ చక్కగా, శాశ్వతంగా గుర్తుచేయాలి; చనిపోయినవారినించి జీవించి ఉన్నవారు తీసుకోవలసిన శాసనం కావాలి. వారు గాథలనుండీ, పురాణాలనుండీ గతాన్ని

తీసుకుని పునర్నిర్మించుకునేందుకు, ఆవిధంగా తమబాధ్యతలను నిర్వర్తించుకునేందుకు ఉపయోగిస్తుంది

ఆ విధంగా భూమిని శాశ్వత వర్తమానాన్నించి, గతాన్నించి చూడడం కవిత్వానికి ముడిపదార్థంగా ఉపయోగపడుతుంది.

## IV

నా మనస్సు గతంవేపు మళ్ళిందనుకోవడం నిజంకాదు నా సమకాలీనుల్లాగే నేను రాబోయే సర్వనాశనాన్ని తలుచుకుని వ్యధాభరితుణ్ణయ్యాను. కాని, నా కవితాత్మను పరిశీలిస్తే ఈ చీకటి యుగంలో న్యాయబద్ధమైన ప్రశాంత ప్రపంచంకోసం తపిస్తున్నదని మీ కర్థమౌతుంది. ఈ సందర్భంగా ''విషాదానికి బానిసకావొద్దు'' ని నాకు బోధించిన వ్యక్తిని తలుచుకోవడం సబబుగా ఉంటుంది మేము మా మాతృదేశపు సరస్సులు, నదులు, ప్రాచీన పరంపరాగత ఐతిహాసాల నించేగాక ప్రజలనించి కూడా ఎన్నోవరాల్ని పొందాము మమ్మల్ని ప్రభావితం చేసిన గొప్ప వ్యక్తి, బంధువు - ఆస్కార్ మీ-వోష్. ఆయన నన్ను తన కుమారునిలాగ చూసుకునేవాడు ఆయన గొప్ప ఋషి, ద్రష్ట. ఆయన ఫ్రెంచికవి ఎలా అయ్యాడూ అంటే, చిత్రమైన ఆయనకుటుంబగాథను, ''గ్రాండ్ డచీ ఆఫ్ లిథూనియా'ను గురించి తెలుసుకోవలసి ఉంటుంది ఏమైనా కానివ్వండి, అర్ధశతాబ్దిక్రితం నా ఇంటిపేరుతో ఉన్న కవికి అంతర్జాతీయ పురస్కారం ఎందుకు ఇవ్వబడలేదో? ఆవిషయాన్ని గురించి పారిస్‌ప్రెస్ ఈ మధ్య ప్రచురించిన పశ్చాత్తాప వాక్యాలు మీరు చదివే ఉంటారు.

ఆయననించి నేను ఎంతో నేర్చుకున్నాను. ఆయన బైబిలు పాత కొత్త నిబంధనల సంబంధించిన మతవిషయాలమీద లోతైన అంతర్దృష్టిని ప్రసాదించడమే గాక మనసు, కళలకు సంబంధించి తటస్థమైన ఋషిపరంపరను అలవరుచుకోవలసిన అవసరాన్ని గుర్తింపజేశారు; ద్వితీయశ్రేణిని ప్రథమశ్రేణితో సమానంగా తీసుకోవడం ఎంత పాపకార్యమో తెలియజెప్పారు ''ప్రాచీనమైన ప్రేమకు జాలి, వొంటరి తనం, ద్వేషం వల్ల కాలం చెల్లిపోయింది'' - అని ఒక ప్రవక్తలాగ ఆయన చెప్పిన మాటల్ని జాగ్రత్తగా విని ఆకళింపుచేసుకున్నాను. ఆయనచెప్పిన మాటలు విషాదాంతానికి పరుగులు పెడుతున్న ఈ వెర్రి ప్రపంచానికి మేలుకొలుపులు. విషాదాంతం తప్పనిసరి అనీ, చివరికి అదొక పెద్ద విషాదాంతనాటకం అవుతుందనీ ఆయన అన్నారు

పద్దెనిమిదవ శతాబ్దపు శాస్త్రవిజ్ఞానం తప్పుదారినపడడంలో ఎన్నో లోతైనకారణాలున్నాయనీ, అందువల్ల భయంకర పరిణామాలు రాబోతున్నాయనీ ఆయన గ్రహించారు. విలియం బ్లేక్ లాగ కాకుండా ఓ కొత్త యుగం రాబోతుందనీ; శాస్త్రవిజ్ఞానం వల్ల రావలసి ఉన్న రెండవ భావ పునరుజ్జీవనం కాలుష్యానికి లోనయిందనీ; శాస్త్రవిజ్ఞానం అంతా అందుకు దోహదం చేయకపోయినా, రాబోయే తరపు శాస్త్రవిజ్ఞానం కొంతయినా అందుకు దోహదం కావొచ్చుననీ ఆయన అంటూండేవారు

విలియం బ్లేక్‌లాగే ఆస్కార్ మీ-వోష్ కూడా శాస్త్రవేత అయిన ఇమాన్యు ఎల్ స్వీడెన్ బోర్గ్ రచనలవల్ల ప్రభావితుడైనాడు. ఆ శాస్త్రవేత్త అందరికన్న ముందుగానే న్యూటన్ తరహా ప్రపంచం మనిషిని ఓడిస్తుందని గ్రహించాడు. నేనుకూడా స్వీడెన్ బోర్గ్‌ని శ్రద్ధగా పఠించాను - అయితే భావయుగంలో ఆయనను అర్థంచేసుకున్న పద్ధతిలోకాదు. ఇలాంటి సందర్భంలో ఆయన జన్మించిన దేశాన్ని సందర్శిస్తానని నేనన్నడూ ఊహించలేదు.

మన శతాబ్దం ముగియబోతున్నది. దీనిలో ఎన్నో ప్రభావాలు అయినా ఇది నమ్మకంతో, ఆశతోనే గడిచింది ఒకగొప్పమార్పు అప్పుడప్పుడూ దృశ్యమానమై మనల్ని ఆశ్చర్యపరుస్తోంది. ఆ మార్పే ఆస్కార్ మీ-వోష్ మాటల్లో ప్రతిధ్వనిస్తోంది. ''శ్రమపడే కోట్లాది ప్రజల నిగూఢరహస్యం సజీవంగా, శక్తివంతంగా, వేదనాభరితంగా ఉంది.'' వారి రహస్యాన్ని వ్యక్తపరిచేందుకు సరైన భాష లేదు వార్తావాహికలు, మేధావులకు ఈ విషయంలో అనితరమైన గురుతర బాధ్యత ఉంది

మార్పు జరుగుతూనే ఉంది అది ఏ తాత్కాలికమైన భవిష్యవాణినీ లెక్కచేయదు. ఎన్ని భయానకాలు, ప్రమాదాలు పొంచివున్నా, మనతరం ఈ ప్రయాసల్లోంచి కొత్త అవగాహనలోకి అడుగిడుతుంది అప్పుడు సరికొత్త పరంపర సంఘటించబడుతుంది. 'సియోన్ వెయిల్', 'ఆస్కార్ మీ-వోష్' లాంటి వారిని అనుసరించిన వారికి, చదివినవారికి తగిన ప్రతిఫలం తప్పక లభిస్తుందని నేను భావిస్తాను మనం ఎవరితో బంధాల్ని కలిగి ఉన్నామో వారిపేర్లను అందరికీ ప్రకటించారు అలా చేసినందువల్ల మన మార్గమూ, స్థితీ అందరికీ అర్థమౌతాయి కవులకు సహజమైన అనేక విధాలుగా వెలిబుచ్చిన నా ఆలోచనా సరళితో కూడిన ఈ ఉపన్యాసపు ఉద్దేశ్యం అదే ఇక్కడున్న మనమంతా గతాన్నీ భవిష్యత్తునీ కలిపే లింకులం.

జెస్లా మీ వోష్(Czeslaw Milosz (Mee - Wosh) 30 జూన్ 1911లో అలెగ్జాండర్, నీ వెరోనికకునాట్‌లకు లిథుఏనియా, పోలండ్‌లో జన్మించాడు. 1929లో స్టీఫెన్ బాటరీ (విల్నా) విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం చదివాడు. ఆరోజుల్లోనే పోలిష్ స్టడీస్ లిటరరీ క్లబ్‌లో క్రియాశీలంగా పాల్గొన్నాడు. అతని మొదటి పద్యాలు 1930లో ప్రచురితమయ్యాయి. తరువాతి సంవత్సరం మరొకరితో కలసి సాహితీ సమాజాన్ని స్థాపించాడు. అందులో ''జాగరి'' (Zagary = knidling) భాగాన్ని తరవాత ''ప్రళయ'' కవిత్వం అన్నారు.

రెండో ప్రపంచ మహాసంగ్రామంలో నాజీలు ఆక్రమించిన వార్సాలో అజ్ఞాతంలో ఉండి చాల కృషిచేశాడు. 1941లో జాన్‌సైరక్(Jan Syrue) అనేమారుపేరుతో పద్యగ్రంథాన్ని ప్రచురించాడు. నాజీ వ్యతిరేక పద్యాలన్ని సంపాదించాడు.

1945 డిసెంబరులో న్యూయార్క్‌దౌత్య కార్యాలయంలో పనిచేశాడు. 1950 వరకు అమెరికాలో ఉన్నాడు. తరవాత పారిస్‌లోనే ఉన్నాడు. తరవాత పారిస్‌లోని పోలిష్ దౌత్య కార్యాలయంలో సెక్రటరీగా ఉన్నాడు. అప్పుడు ఒకసారి వార్సావస్తే, అతనిపాస్‌పోర్ట్‌తీసేసుకున్నారు. 1951లో అతడు ఫ్రెంచ్ రాజకీయాశ్రయాన్ని అర్థించాడు.

1951నుంచి 60 వరకు అనువాదకుడుగా పనిచేశాడు.
అతడి మొదటి నవల The Seizure of power
రెండో నవల The Issa Valley (1955)
అతని స్వీయకథ Native realm (1958)
వ్యాససంపుటి-Continents (1958)

ఇంకా ఎన్నో గ్రంథాలు రాశాడు 1982 వరకు రాస్తూనే ఉన్నాడు అనేక బహుమతులు గెలుచుకొన్నాడు.

''తీవ్ర ఘర్షణల ప్రపంచానికి గురైన మానవుని స్థితి గతులను రాజీలేని సారళ్యతతో అభివ్యక్తీకరించినందుకు నోబెల్ బహుమతి''

– సంపాదకుడు.

# ఆత్మన్యూనతా భావన నుంచి బయట పడాలంటే?

– అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

ఆత్మన్యూనతాభావన అంటే ఇతరుల కంటె తాను తక్కువ వాడినని, అల్పుడనని, నిరర్థకుడనని జీవితంలో ఏమీ సాధించలేని వాడనని, భావిస్తూ, ఆత్మవిశ్వాసం లేకుండా, దయనీయస్థితిలో ఉండడం ఈ భావన కొందరిలో తీవ్రంగా ఉంటే, మరి కొందరిలో అంత తీవ్రంగా ఉండదు. అంతేగాని అసలు ఆత్మన్యూనతా భావనలేని వాడంటూ ఎవడూ ఉండడు ఎందుకంటే మనం ఈ ప్రపంచంలో పుట్టినప్పుడు నిస్సహాయులుగా పుడతాం తల్లిదండ్రులు సహాయం లేనిదే బ్రతికి బట్ట కట్టలేం అంతేకాదు, మనం అంతిమంగా మరణిస్తాం జాతస్యమరణం ధృవమ్. మృత్యువును జయించలేని బలహీనత. విశ్వం బృహత్తరం అది మార్మికం. దురవగాహరి. అటువంటి ప్రపంచం ముందు మనిషి ఏ పాటి? దానిని అర్థం చేసుకోలేని నిస్సహాయుడు.

దీనినే మరో కోణం నుంచి చూస్తే, ఈ నిస్సహాయత, దయనీయతలే మనిషిని ఈ విశ్వాన్ని ప్రశ్నింప చేశాయి. ఇంతటి బృహత్తర విశ్వాన్ని మానవుడు తన బుల్లి బుర్రలో ఇముడ్చుకొన్నాడు గ్రహాంతర యానం చేశాడు. విశ్వ రహస్యాలను భేదించాడు. వీటన్నిటి వెనుక ఉన్నకారణం మానవుడు తన న్యూనతకు ప్రతిస్పందించి ఆధిక్యతా దిశలో పయనించడమే. అందువల్ల, ఒక విధంగాచూస్తే న్యూనతా భావన మానవునికి వరప్రసాదమే. అయితే ఇది అతిగా ఉండరాదు

ఆత్మ న్యూనతా భావన కొందరికి వరమైతే, మరికొందరి విషయంలో శాపమవుతుంది. ఆత్మన్యూనతా భావన మోతాదుకు మించక పోతే ఆరోగ్యకరమే. మించితే అనారోగ్యం ప్రతిమానవుడు న్యూనతా భావనకు గురవుతాడు గనుక, దీనిని - అంటే న్యూనతను, లోపాన్ని, అల్పత్వాన్ని పూడ్చుకోవడానికి తద్వ్యతిరేక దిశలో అంటే నష్టపరిహారంవైపు ఇంకా మాటాడితే అతి పరిహారం వైపు ఉద్యమిస్తాడు. అంటే మనం సాధించే విజయాల వెనుక నష్టపరిహార సూత్రం పనిచేస్తుంది. ప్రతి మానవయత్నం వెనక ఉన్న అదృశ్యశక్తి ఆధిక్యతాధికారాల కోసం పెనుగులాట. ఈ అధికారం, ప్రతిష్టలు కోరని మానవుడు ఎవడు?

పుట్టుకతో వచ్చిన నిస్సహాయత కాక, సామాజికానుభవాలు గూడ వ్యక్తిని న్యూనతకు గురి చేస్తాయి. ఒక్కోసారి ఈ నిస్సహాయత చుట్టూ ఆత్మదయనీయత, ఆత్మవిశ్వాస రాహిత్యం, లాంటి భావనలు పెనవేసుకొంటాయి. ఇది ఒక గ్రంధిగా తయారవుతుంది ఇదంతా సామాజికానుభవాల పర్యవసానం. అయితే అదంతా వ్యక్తికి తెలియదు. అంటే ఈ న్యూనత అచేతనంగా ఉంటుంది అయినా ఈ న్యూనతా భావన వ్యక్తి సహించ లేనంతగా అభద్రత, అశక్తత, అపర్యాప్తతలను పుట్టిస్తుంది. వీటిని మనిషి జీవనసమరంలో ఎదుర్కొంటాడు అతడికి జయమో అపజయమో కలుగుతుంది. జయం కలిగితే అతడు ముందుకు సాగిపోతాడు. అపజయం కలిగితే మనిషి కుంచించుకు పోయి న్యూనతా భావనతో రోగగ్రస్తుడవుతాడు.

శారీరక లోపాన్ని గూడ న్యూనతగా పరిగణిస్తారు. అయితే కొందరి విషయంలో ఈ శారీరక లోపం వారిని మహా మహులుగా చేసింది. అమెరికా ప్రెసిడెంట్ ఫ్రాంక్లిన్ డి రూజ్వెల్ట్ వికలాంగత్వం

ఆయన విజయాలకు అడ్డురాక పోగా అది నేపథ్యంలో ఉండి ఎంతో దోహదం చేసింది. హెలెన్‌కెలర్, బాతోవెన్ ఎడిసన్ లాంటి వారు తమశారీరక లోపాలను అధిగమించి ఎన్నో విజయాలను సాధించారు. వారి విషయంలో వికలాంగత్వం ఒక ప్రచోదక శక్తిగా పనిచేసింది

అంతేకాదు, అసలు ప్రకృతిలోనే ఒక చోట నష్టం మరోచోట లాభంగా పరిణమిస్తుంది. చూపులేని వారికి వినికిడి జ్ఞానం ఎక్కువ పొట్టివారికి పుట్టెడుబుద్ధులు పొట్టితనం వల్ల వచ్చిన నష్టాన్ని, న్యూనతను, అధిక తెలివితేటలు పూరించాయి

శారీరక వికలాంగత్వమే కాకుండా కొంతమందికి మానసిక వికలాంగత్వంగూడ ఉంటుంది. వీరు అతి సున్నిత మనస్కులుగా ఉంటారు వీరి సున్నితత్వం వీరిని ముడుచుకు పోయేట్టుచేసి విజయద్వారాలను మూసి వేస్తుంది ఇలాంటి వారు క్రమంగా ఆత్మ దయనీయతను లేదా ఆత్మసానుభూతిని వాంఛించే వారుగా తయారవుతారు ఇతరుల సానుభూతి కోసం అంగలారుస్తారు. ఈ విధంగా మానసికంగా కుంగి పోయిన వారు తమ దుస్థితిని ఎదిరించ లేక సమాజాన్ని తప్పుపడతారు

న్యూనతా భావనతో సతమతమయ్యేవారి లక్షణాలను మనం ఇలా క్రోడీకరించ వచ్చు మొదటి లక్షణం - ప్రతి న్యూనతా భావం గ్రంథి వెనుక స్వార్థం ఉంటుంది రెండవది - అతడికి సంయమనం ఉండదు - అంటే ఆత్మవిశ్వాసం పెంచుకోవడానికి అతడు చేయవలసినదంతా చేయడు. ఏదో సరళవమార్గంలో తన ప్రమేయం ఏమీ లేకుండానే, దానంతటదే పరిష్కారం అవుతుందనుకొంటాడు అతడి ఆత్మదయనీయత అతడిని ఏమాత్రం శారీరకంగా, మానసికంగా శ్రమ పడనీయదు. మూడోది న్యూనత దానికి వ్యతిరేకముఖంతో దర్శనమీయ వచ్చు. న్యూనతతో బాధ పడేవారు తాము ఇతరుల కంటే అధికులమన్నట్టు ప్రవర్తిస్తారు అల్పుడెపుడు ఆడంబరంగా పలుకుతాడు. పొట్టివాడు నడిచేటప్పుడు ఎక్కువ ప్రదేశాన్ని ఆక్రమిస్తాడు అంటే చాల వెడల్పుగా నడుస్తాడు. నాలుగోది ప్రేమావశ్యకత. ప్రేమించ బడాలని ఎవరికుండదు? ప్రేమించబడాలంటే ముందు ప్రేమించాలి. ప్రేమంటే ముద్దులు, కౌగిలింతలూకావు. అది ఒక ప్రశాంత మానసిక స్థితి. అది అప్రయత్నంగా ప్రసారితమవుతుంది. ఇది ఆత్మవిశ్వాసం ఉన్నవారికే సాధ్యం. ప్రేమించడంచేత కాక పోవడానికి ఆత్మన్యూనతా భావనయే కారణం

ప్రేమ, శ్రద్ధల కోసం వీరు అర్రులు చాస్తారు. కాని వాటిని సాధించడం ఎలాగో వారికి తెలియదు. అందుకని వారు ప్రపంచాన్ని తప్పులు పడతారు. ఈ న్యూనతా భావన లోపల బాగా బలపడిన వారు అత్తమీద కోపం దుత్తమీద చూపిస్తారు భార్యా బిడ్డలను బాగా చూసుకొనే ఒక గుమస్తా ఉద్యోగంలో ఉన్నతికి పోలేక, న్యూనతా భావనతో కుంగిపోయి ప్రతిచిన్న విషయానికి భార్యబిడ్డలను తప్పులు పట్టి ఇంటిని నరకంగా మారుస్తాడు. ఇది ఒక రూపం. ఇదే మరో రూపం తీసుకుంటే అతడు వాస్తవం నుంచి పలాయనం చిత్తగించి త్రాగుడుకు బానిస అవుతాడు.

మరి ఈ న్యూనతా భావన నుంచి బయల పడాలంటే ఏమి చెయ్యాలి. మొట్టమొదట నీవు చేయవలసింది ఏమంటే? నీ జీవిత లక్ష్యం ఏమిటి? దానిని సాధించడానికి నీకున్న శక్తి యుక్తులేమిటి? అవకాశాలేమిటి? పరిమితులేమిటి? అనే ప్రశ్నలను సమన్వయం చేసుకొని

లక్ష్యానికి - దాని సాధనకు మధ్య ఉన్న దూరాన్ని గుర్తించాలి. దూరం ఎక్కువైతే లక్ష్యం తగ్గించుకొని, సాధనను పెంచుకోవాలి.

రెండోది, నీవు అల్పుడవని భావిస్తూన్నావంటే భావనకు మూలమేదో, నీవేమైనా అసాధ్యాన్ని సాధ్యం చేయాలను కొంటున్నావేమో గమనించాలి

మూడవది, నీలో ఏదైనా లోపం ఉంటే దానిని గుర్తించి దానిని వెంటనే అంగీకరించు - దాటవేయకు

నాలుగోది, కారణం తెలిస్తే సగం సమస్య పరిష్కారమైనట్లే. ఆత్మ విశ్లేషణ ద్వారా లోపాన్ని ఎరిగి, దానిని ఎలా సరిదిద్దుకోవాలో ప్రయత్నించు. మామూలు ప్రయత్నంగాక ఎక్కువగా ప్రయత్నించి ఆత్మ సంతృప్తినిచ్చే కొన్ని వ్యాపకాలను చేపట్టు. సంగీత సాహిత్య క్రీడలు - ఏవైనా, అవి నీకు ఔషధంగా పనిచేయవచ్చు ఆత్మ నింద వల్ల అంటే నిన్ను నీవు తిట్టుకొంటూ కూర్చోవడం వల్ల ప్రయోజనం లేదు అంద వికారినని భావించిన ఒక అమ్మాయి తన వికృత రూపాన్ని చూసుకొంటూ కూర్చుంటే ఏమీ ప్రయోజనం లేదు. నృత్యం తరగతులను ఎగగొడితే ప్రయోజనం లేదు నృత్యం తరగతులకు హాజరై నృత్యంలో అభినివేశాన్నిపొంది, పేరు సంపాదించి, వికృత రూపాన్ని అధిగమించాలి.

ఐదోది, ఇతరులను ఒప్పించాలని పట్టు పట్టకు. నీవు నీవుగా ఉండు ఇతరులతో మృదువుగా, సరళంగా, విశ్రాంతిగా ఉండు.

ఆరోది, నీ కిష్టం లేని పనులకు దూరంగా ఉంటే, న్యూనతా భావన అధికమవుతుంది. ఇంట్లో కూర్చున్నందువల్ల సమాజంలోని చొరవ పెరగదు. సిగ్గుని అధిగమించలేవు. బయటికి వెళ్ళు. జనావళిని కలువు. ప్రతివ్యక్తీ ఒక తెరవని గ్రంథం - ఆగ్రంథాన్ని చదువు. వారి అనుభవాలను స్వీకరించు.

ఏడోది, వెనకడుగు వేయక ఏమీ చేయలేకపోతే ముందడుగు పడేవరకు అక్కడే నిలిచిపో. బాధ్యతలను తప్పించు కోవాలను కోకు. స్వావలంబనం అదేవస్తుంది.

ఎనిమిదోది, గొప్పవాడవు కావాలనుకొంటే గొప్పలక్ష్యం పెట్టుకో, గొప్పగా ఆలోచించు.

తొమ్మిది, జీవితంలో నీకేమికావాలో దానిని నిర్ణయించు కొని, ఆ దిశలో నడువు.

పది, మడి గట్టుకు కూర్చోకు నీమనసు ద్వారాలను తెరిచి ఉంచుకో.

పదకొండు, ఒక నోట్ పుస్తకం పెట్టుకొని, దినదినం నీవు సాధించిన ప్రగతిని అందులో రాయి. ఆత్మాభివృద్ధికి వెచ్చించిన సమయం బాగా గడిపినట్లే

ఇవన్నీ మార్గ నిర్దేశక సూత్రాలు. సూత్రాలు వల్లెవేసి నంతమాత్రాన ఆత్మ న్యూనత నుంచి ఎవరూ బయట పడలేరు క్రికెట్ రూల్సు తెలిసినంతమాత్రాన ఎవడూ క్రికెట్ ప్రవీణుడు కాలేడు. ఆ ఆటను ఆడాల్సిందే. ఇదీఅంతే.

# స్వప్న బీభత్సంలో అక్షరాకృతి

(ప్రముఖకవి **అజంతాగారికి** ఇటీవల కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రకటించిన సందర్భంగా ఈ వ్యాసం - సంపాదకుడు)

- ప్రొ. వెంకట్

గాఢచింతన, తాత్విక ఆలోచన లేదా ప్రతిఫలనం అనేది ఈ రోజుల్లో తెలుగులో సాహిత్యంలో మాత్రమే కనిపిస్తుంది తెలుగులో స్వతంత్ర తాత్విక సంప్రదాయం అనేదేదీ లేదు ఏదయినా ఉంటే అది సంస్కృత సంప్రదాయ దర్శనాలపైన గానీ, పాతుకుపోయిన సిద్ధాంతాల పైనగానీ ఆధారపడిన తాత్వికత మాత్రమే. అయితే సాహిత్యానికి తాత్విక ప్రతిపాదనలు చేయవలసిన పనిగాని, అవసరంగాని లేదు ఇంకా చెప్పాలంటే సాహిత్యం ఒక విధంగా చక్రాలుగా, బిగుసుకున్న తాత్విక సిద్ధాంతాలను తలకిందులు చేస్తుందనవచ్చు.

తెలుగులో సంపూర్ణీకరించని తత్వ చిత్‌చింతనలను సాహిత్య ప్రక్రియగా రూపెత్తించి, సాహిత్యానికి ఉన్న మౌలిక శ్రద్ధను రహస్య ధ్వంసాచర్యగా సంబోధించే రచనలు తక్కువ. వాటిలో అజంతా రచనలకు నిరుపమాన స్థానం ఉంది.

అజంతా రచనలలో క్లిష్టత ఉంది అయితే క్లిష్టత కంటే ముఖ్యంగా మనలను ఎదుర్కొనేవి, మనం వద్దనుకున్నా మనపై ముద్రవేసేవి మనల్ని కల్లోలపరిచే భీకర ప్రతీకలు - ఖండిత హస్తాల సంఘర్షణ, గాయపడిన స్వప్నాలు, అగ్ని వర్షించే అదృశ్య నేత్రాలు, భయవిదగ్ధమైన కంఠాలు, గాయపడిన స్వప్నాలు, మనిషి తనను తానే హననం చేసుకుంటున్న నిజాలు - మొదట్లో మనల్ని భయకంపితుల్ని చేస్తాయి, అసహాయ విస్మయుల్ని చేస్తాయి. జుగుప్సతో కలచివేస్తాయి. ప్రతివాక్యం ఎలా ముగుస్తుందో, ఏ దృశ్యం ఎప్పుడు మనపై విరుచుకుపడుతుందో, ఏ భీకర శబ్దం మనల్ని భయపెట్టి బధిరుల్ని చేస్తుందోనన్న సందేహ భూతాలు మనల్ని వెంటాడుతాయి అది నిజంగా ఒక దుష్ట స్వప్నానుభవం - మనల్ని వెంటాడుతున్న ఒక ప్రేతరాత.

1

ఏ శిల్పం? ఏ సాహిత్యం?
ఏ శాస్త్రం? ఏ గాంధర్వం?
ఏ వెల్లులకీ ప్రస్థానం?

చీకటి ప్రజ్వలించే రోజుల్లో, అశ్రుదగ్ధమైన నీడల్లో విన్పించే క్షతగాత్రం అజంతా కవిత్వం శూన్య చీకట్ల ప్రవల్లికలలో నడవగలిగితే అజంతా రచనలకి స్పందించగలమేమో!

అతి సాధారణంగా మారిపోయిన విధ్వంసకాండలో అమానుషీకరించబడిన జీవితం, అందులో మతకక్షలు, మానభంగాలు, 'సామన్య' సంఘటనలు అజంతా కవిత్వానికి నిరంతర వేదనా వస్తువులు. ఈ అమానుషీకరణ పాతుకుపోయిన అన్ని రూపాలనూ, సాంప్రదాయాలనూ ఆవరిస్తుందని అజంతా చూపిస్తారు అందుకే ప్రసిద్ధమైన సంప్రదాయాలను (మతం దేశభక్తి మొదలైనవి) అజంతా ఏవగించుకుంటారు.

---

(**ప్రొ. వెంకట్‌గారు** వాషింగ్‌టన్ యూనివర్సిటి (అమెరికా)లో ఇంగ్లీష్ సాహిత్యంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు.)

''మనిషి ఆకలితో చస్తున్నా మోక్షప్రాప్తి ముఖ్యం కదా!
దేశభక్తులు వర్ధిల్లుగాక!''

''మనిషి ఒక్కడే, భగవంతుడు ఒక్కడే అని నగరం నడివీధిలో ఒక పబ్లిక్ రాక్షసుడు కన్నీళ్ళు క్రుమ్మరిస్తున్నాడు భయంకరంగా''.

విలువలకు నిలయంగా సంప్రదాయ గౌరవాన్ని పొందిన మతం, దేశభక్తి అజంతా రచనలలో ఇంకెంత మాత్రం విలువలకు మూలంగా కనిపించవు అయితే, అట్లాంటప్పుడు మంచి చెడు నిర్ణయించుకునే సందర్భంగా మనకు దిక్సూచి ఏది?

అజంతా రచనలు సమకాలిక విషయాల మీద, దైనందిన సంఘటనల మీద రాయబడినట్లు కనిపించినా, అవి ఆయా చారిత్రక సంఘటనల్ని (హైదరాబాద్ మతకల్లోలాలు, రాజీవ్ గాంధి హత్య వగైరా) మాత్రమే చిత్రించినట్లు భావించలేం సమకాలిక సంఘటనలకు స్పందించినట్లు అనిపించినా ఆలోచనలలో అంతర్లీనంగా ఒక సుదీర్ఘమైన సంఘర్షణ కనపడుతుంది. ఈ ఘర్షణకి సాధారణమైన సామాజిక ప్రభావాలుగా చూపించడం అజంతా విషయంలో తొందరపాటే అవుతుంది.

ఏ విధంగానైతే సాంప్రదాయికంగా మానవత్వపు విలువలకు మౌలికమైన వస్తువులుగా పరిగణన పొందిన 'మతం', 'దేశభక్తి', 'రాజకీయాలు' మొదలైన వాటికి 'దూరంగా' ('అతీతంగా') ''మానవత్వం'' గురించి అజంతా ప్రశ్నిస్తాడో, అలాగే తన కవితా ప్రక్రియను తక్షణ సంఘటనలకు స్పందించి సృష్టించినప్పటికీ ఆ సంఘటనలకు సంపూర్ణంగా పరిమితం కానివ్వడు. అజంతా రచనల్లోన్ని ఘర్షణకు ఒక ప్రత్యేకమైన స్వీయానుభవ సంఘటనకు ముడిపెట్టటం పొరపాటు. ఉదాహరణకి, ''అర్థరాత్రి భీభత్సం మేలు కొనేటప్పుడు'' అనే పంక్తి ''అర్థరాత్రి సంకేతం కదా, విద్రోహి నిద్రలేచాడను కొంటాను'', లేదా ''అర్థరాత్రి ఒక గల్లీలో తన మృతదేహం....'' పంక్తులలో కొనసాగింపు ఉన్నట్లనిపిస్తుంది. కానీ నిజానికి మొదటి పంక్తికీ, మిగతా పంక్తులకు మధ్య సుమారు నలభైరెండు సంవత్సరాల దూరం ఉంది. ఇటీవల రచనలకు చారిత్రకసంఘటనలతో స్పర్శ ఉండటంతో అది సమకాలీన సంఘటనలకు ప్రతిస్పందనలుగా లేదా, వాటికి ప్రతిఫలనాలుగా సులువుగా చూపించవచ్చు. కానీ నిజానికి అటువంటి ప్రమాదాలు అజంతా కవిత్వాన్ని అర్థం చేసుకోడానికి తోడ్పడవు.

అజంతా దృష్టిలో కవిత్వ సృష్టి ఒక మహావిస్ఫోటన. ''గణితం'' అనే కవితలో బలికోరుతున్న అక్షరాలు, ఊపిరాడని వాక్యాలు, గన్‌పౌడర్ పద్యాల గురించి రాస్తూ, కవిత్వం నిజంగానే ఒక రహస్యోద్యమం అంటారు కవి. కానీ ఈ రహస్యోద్యమం చూపించే ఘటనలన్నీ స్వప్న చర్యల అక్షరీకరణ మాత్రమే. ఇవి అక్షర నిజాలుగా మారుతున్న స్వప్న సంకేతాల సముదాయాలు. ఈ ''ఉద్యమం'' లో తిరుగుబాటు చేస్తున్న / అవుతున్న నిజాలు - ''గాయపడిన నీళ్ళు ఉవ్వెత్తున... నగరం మీద విరుచుకుపడడం విశేషం''.... ''క్లిష్ట భూయిష్టమైన ఆకాశం కింద మనిషి ముఖకవళికలపై చీకటి ఎర్రబడుతున్నదా? ''ఆగ్రహాగ్నిలో చేతులు ఎర్రబడుతున్నాయా .. మనిషి ఎర్రబడుతున్నాడా!... రోడ్లు ఎర్రబడుతున్నాయా?'' - ఈ ''నిజాలన్నీ'' వాంఛించిన, కోరుకున్న ఫలితాలు మాత్రమే. ఈ విషయం తెలిసిన కవి ఈ నిజాలను స్వప్న సందిగ్ధంలోనే అల్లుతారు. వాటిలో రూపుదిద్దుకున్న అక్షర రూపం సందిగ్ధంగానే ఉండిపోతుంది ప్రతి ఇచ్ఛ /

anticipation సంశయంలో ముగుస్తుంది - ''పడుతున్నదా'', ''పడుతున్నాయా''.. వగైరా

సాహిత్య ప్రక్రియ దాని వైశిష్ట్యం తెలియని కవి తొందరపాటు ఇలాంటి సందర్భాల్లో గమనించవచ్చు ఉద్యమం అనే సర్దర్భం ప్రత్యక్షంగానో తద్విరుద్ధంగానో వచ్చి రావడంతో ఆకవి కవిత్వాన్ని ఒక పనిముట్టుగా మారుస్తూ, సెంటిమెంటలైజ్ చేసిన సన్నివేశాలను, నీతివాక్యాలతో ప్రశ్నలు గుప్పిస్తుంటాడు. ఇదీ ఒక వాంఛా పరితృప్తి కలిగించే చర్య అయినప్పటికీ కవి దీన్ని అత్యంత గంభీర సత్యంగాను, విప్లవంలో భాగంగాను భావిస్తాడు ఈ అమాయక కవి, అజంతా నుంచి సాహిత్య(ంలో) విధ్వంస చర్య గురించి ఓనమాలు నేర్చుకోవాలి

బాధ, భాషలకు, అంతర్ - బాహ్య ప్రపంచానికీ ఉన్న సంబంధం క్షుణ్ణంగా తెలిసిన రచయిత కాబట్టి అజంతా ఏ విధమైనటువంటి పారలౌకిక వాదానికి గాని, భావవాదానికి గాని తలవంచడు బాధకీ, అంతర్బాహ్య ప్రపంచాలకీ సరళమైన లేదా ప్రత్యక్ష సంబంధం ఉండలేదని అజంతా కవిత్వం సూచిస్తుంది. ఆయన కవిత్వంలో అంతర్బాహ్య ప్రపంచాలను ఉద్దేశించే ప్రతీకలన్నీ స్వప్నచిత్రాలే ఈ చిత్రాలు నిరంతర వ్యథతో, మళ్ళీ మళ్ళీ చెప్పడంతో వాటి నిర్ధారిత భౌతిక సంకేతస్థాయి సందిగ్ధంలో పడుతుంది కానీ అజంతా తన కావ్యాన్ని స్వప్నలిపిగా గుర్తించుకున్నా ఈ రెండు పదాల function ఈ కావ్యంలో మౌలికంగా భిన్నమైంది. స్వప్నసంకేతాలు అనిర్ధారితాలు అక్షర నిజాలు రూపాకృతాలు. స్వప్నచర్య ఇప్పటికీ ఎప్పటికీ మనకు అంతుపట్టనిదే. మహా అయితే దానిని మరోసారి మాత్రమే మననం చేసుకోగలం. అప్పుడు అక్షరరూపం ఇవ్వడానికి, పునశ్చరించడానికి లేదా, పునఃస్థాపించడానికి - అక్షరరూపంలోగాని, వేరేవిధంగా గాని, భాషా మాధ్యమ సంధాన స్వభావంపై ఆధారపడే తప్పనిసరి అవసరం మనకు ఎదురవుతుంది (The dream work is always already inaccessible to us What we can have at the most is only a secondary revision - our effort to verbalize, recount or narrate our dream experience our efforts to recapitulate it - verbally or non-verbally-indicate our inseparable need to depend on the mediating role of language (verbal or non-verbal).

అందుకే సులభంగా అర్థమౌతున్నట్లున్నా అజంతా కావ్య సంకలన శీర్షిక - స్వప్నలిపి - స్వప్నాలకి లేఖనానికీ మధ్య ఉన్న నిగూఢమైన సంబంధాన్ని సూచిస్తుంది. అర్థరహితమైన లేదా అర్థ సందిగ్ధతలో ఉన్న స్వప్న జగత్తులోని విస్మయ భీతి సంకేతాన్ని తేట తెల్లం చెయ్యడంగానీ వాటి అర్థసారాన్ని అందించడంగానీ అజంతా రచనల ఉద్దేశ్యం కాదు అందుకు విరుద్ధంగా మనకు సులువుగా అందుబాటులో ఉన్నాయనుకున్న నిత్య జీవితంలోని 'నగ్న సత్యాలలో' ఇమిడి ఉన్న సంక్లిష్టతని, వాటి నిగూఢతను పదేపదే సూచిస్తుంటాయి అజంతా రచనలు అవగాహనలో, అందుబాటులో ఉన్న అక్షర రూపాల్లోని మర్మాన్ని గుర్తించమంటాయి అజంతా రచనలు

ఇది గుర్తించలేని అన్వేషణ సాహిత్య ప్రక్రియల సాధ్యతలవైపు మనల్ని పోనీయదు కవితాక్రియ మౌలికంగా ఒక పోరాటం. ప్రపంచాన్ని చూడడంలో, స్పందించడంలో నూతన మార్గాల అన్వేషణకు తెలిసిన, పాతుకుపోయిన విషయాలకు గొంతుక ఇచ్చే ప్రయత్నానికి అవసరమైన శ్రమ. (Poetic activity is fundamentally a struggle for newer ways of

responding to the world, newer ways of articulating the received, transforming the given). ఈ దృష్టి నుంచి అజంతా సాధించింది నిజంగా అసమానం. ఆయన రచనల్లోని ఆవేదన ఘర్షణ అంతా మనకున్నటువంటి భాష, అభివ్యక్తీకరణ రీతులు, మన సంప్రదాయపు అవగాహన వీటన్నింటినీ కుదిపేస్తుంది ఈ ప్రయత్నం ఒకే రచనలో దీర్ఘంగా సాగకుండా ఒక విధమైన, నాటుకుపోయిన ప్రతి కవితలో repeat అవుతుంది ఈ నాటుకుపోయిన (obsession) భావం అసహాయ రోగగ్రస్థ పదచిత్ర పరంపరలో వ్యక్తమౌతుంది. ప్రత్యేకంగా ఒక రూపాన్నిగానీ, రూపాంశలతోగానీ సరిపెట్టుకోకుండా భాషగానీ, భాషలోనే, భాషమీదనే ఒక విధమైన హింసగా, హింసతో చూపిస్తారు అజంతా. ఈ కవితల్లో మాట్లాడే వ్యక్తి ఒక కల్పనాత్మక రూపం (imaginary subject) అయితే వ్యక్తమైన అభివ్యక్తమైన ఘర్షణ మాత్రం కాల్పనికం (మిధ్య, ఊహ) అనలేము. గొంతు భాషాత్మకమైన వ్యక్తిగొంతు. అదొక కల్పన. అందుకే కవితా రూపానికీ ఆకారానికీ అంత స్పష్టత ఉండదు (This subject, being a linguistic creation, can have no certainty of shape or form). దీన్ని అజంతా చాలా శక్తిమంతంగా చూపిస్తారు.

నాకు నిలయం లేదు
నాకు విలయం లేదు

శూన్యం మీద శూన్యంగా కూర్చుని
రాలుతున్న నక్షత్రాలమీద నా గీతం రచిస్తాను
చీకటి ఉరికంబంలా నిలబడినచోట
నిశ్శబ్దం మీద నిశ్శబ్దంగా కూర్చుని
గాలిలో దీపాల మీద నా గీతం రచిస్తాను.

నాకు రూపం లేదు
నా రూపం నా గీతం (50)

అయితే మరి ప్రతి గీతానికి ఒక రూపం ఉంటుంది కదా. అయితే అజంతా పద్య రూపాల గురించి రాసేవాడు కాబట్టి ఆయనేదో రూపవాది అనుకోవడం సరైంది కాదు. అజంతాకు పైపై రూపంతో సంబంధం లేదు, అలాగే సంకీర్ణమైన భావనలతో పతాభిలాగా భాషా ప్రయోగాల జోలికి పోరు అతని మౌలిక శ్రద్ధ భాష మీద మాత్రమే. కానీ, అది ఛందో నిరుక్తాదుల బద్ధమైన భాషమాత్రం కాదు (Ajanta never concerned himself with superficially formal or narrowly conceived (పఠాభి లాంటి) linguisic experiments. His fundamental concern is with language and this is not linguistic)

అజంతా రచనల్లో భాష ఒక అఖండమైన బ్రహ్మవాక్కు కాదు - పైగా అది ఖండిత భాష, గాఢంగా బాధపడిన భాష, గాయపడిన అస్తిత్వ శరీరం. (On the contrary, it is a mutilated deeply afflicted, laearating body of existence): '' ఉరిత్రాళ్ళు నా ఊహలు / సంకెళ్ళు నా మాటలు / నా పై రువ్విన రాళ్ళు నా అక్షరాలు''. భాషే ఒకవిధమైన భంగపడిన,

భంగపరిచే (Violent, Violated) హింసాత్మక యంత్రం అయినప్పుడు, దాన్ని విడువలేకుండా దానిలోనే వసిస్తూ, దాని ద్వారానే పలకడం / పలికించడం ఒక ఆత్మత్యాగ / పునరుత్థాన చర్యగా (Sacrificial / Regenerative) అజంతా రచనలు చూపిస్తాయి ఇక్కడ పలికేదీ పలికించేదీ ఏదో భౌతికాతీత దైవశక్తిగా భావించడానికి ఆస్కారం లేకుండా చేస్తాడు కవి. అయితే ఇక్కడ గమనించాల్సిన ముఖ్యవిషయం ఏమిటంటే, ఈ ఆత్మ పరిత్యాగ / పునరుత్థాన చర్య కూడా ఏదో మహత్కార్యాన్ని ఉద్దేశించి కవి ఒక సచైతన్య కారకంగా ( అజంతా - Ajanta) రూపొందిస్తున్నాడు అనుకోవడం అజంతా రచనల్ని అపార్థం చేసుకోవడమే అవుతుంది. ఈ స్వకీయ వ్యక్తిత్వాన్ని తుడిచి వేసుకొని లేదా రద్దు చేసుకుని కొనసాగించే ఈ క్రియ ఒక విధమైన జీవనమే. అయితే అదొకగంభీరమైన సుదూర నిర్దిష్టలక్ష్య ప్రణాళిక లేదా సిద్ధాంతంలో భాగమైన అంశంగా మాత్రం కాదు. కానీ దాన్ని స్వకీయ ప్రమేయం లేని జీవనంగా నిలపడానికి పదేపదే ఇలాంటి ప్రదర్శనల ప్రకటనలు చేయాలి. అజంతా కవిత్వం సరిగ్గా అలాంటి జీవనానికి నిదర్శనం (This self effacing or self erasing activity itself is a mode of existence not to be subsumed under some grand teleological scheme At the sametime it is a kind of existence which needs persistent repetition of these self lacerating performances Ajanta's poetry embodies / enacts precisely such an activity / existence).

భాషకి ఒక శారీరక భౌతిక జీవనం ఉందని అజంతా కవిత్వం పదే పదే సూచిస్తుంది. ''ప్రతి అక్షరం ఒకమనిషి. ''ప్రతి మనిషి ఒకఅక్షరం. మనిషి ముఖ కవళికలవలె మనిషి అవయవనిర్మాణం వలెనే అక్షరాలకు కూడా ఒక ఆకారం, ఒక భంగిమ, భావాను గుణ్యమైన ఒక కదలిక, ఒక లయ, ఒక విన్యాసం, రంగు రుచి ఉంటాయని నేను విశ్వసిస్తాను.'' అందుకే నిత్య జీవితంలో సరస్వతీ విగ్రహ విక్రేతలచే వాణిజ్య సరుకు కింద టి. వి. లో వాడకంలోకి వచ్చిన నిరర్థ తెలుగు భాష అజంతా దృష్టిలో ఒక మృత భాష. ''అంతా మృతభాష, మృతభాష; వేదికనిండా శబ్ద కళేబరాలే''. అయితే ఈ మృత ప్రాయమైన భాష నూత్నజీవగతిని పొందాలంటే ఒక శరీరాన్ని ఆశ్రయిస్తే తప్ప వేరే మార్గం లేదంటారు అజంతా. కానీ ఈ ఆశ్రయం ఇచ్చేది ఎలాంటి ( సరుకు) శరీరమైనా చాలదు. అక్షరాంకురార్పణం ''అప్పుడే పుట్టిన శిశువు శరీరం'' ద్వారానే జరుగగలదు అంటే, జీవితం అనేది ఎంత సేపూ పాతుకపోయిన, ఘనీభవించిన, నిరర్థక రూపాలలోనే ఉంటే అది ఉత్త శబ్దకళేబరం మాత్రమే. కానీ బ్రతికి ఉన్న, శ్వాసిస్తున్న జీవి మాత్రం కాదు. ఈ శ్వాస, జీవితం అనేది మళ్ళీ మొట్ట మొదటి సారిగా, పూర్వ నిర్ధారిత ఆధారాలు లేకుండా, స్థిరమైన అర్థం, నిర్ధారణ లేకుండా రూపొందితేనేగానీ భాషకు పునరుజ్జీవనం లభించదు. ఇలాంటి పునరుజ్జీవనాన్నే అజంతా అప్పుడే పుట్టిన శిశువు అనే ''పత్రిక'' ద్వారా తెలియచేస్తారు.

భాష / శరీరాల స్థిరత / అస్థిరత (Continuity / discontinity) లకు నొక్కి చెబుతారు అజంతా. భాష 'ఒక వీధి మనిషి శరీరాన్నైనా ఆశ్రయించాలి' అంటారు. అజంతా కవిత్వంలో ఈ వీధి మనిషిని ఒక సామాన్యుడు (everyman) లేదా నిజప్రపంచంలో వీధి మనిషిగా మాత్రమే తీసుకోలేదు. ఈ ''వీధి మనిషి'' అజంతా కవిత్వపు వీధుల్లో - అంటే భాషా రహదారుల్లో,

గల్లీలలో జనిస్తూ, నిష్క్రమిస్తూ ఎప్పుడూ ఒక సమగ్ర సంతృప్త శరీరం (unified, well -fed body) లా కాకుండా, ''శిథిల శరీరం''లో సంచరిస్తూంటాడు. ఈ వీధి మనిషి మొహాన్ని గుర్తుపట్టడం ఎంత కష్టమో అప్పుడే జనించిన శిశువులోని ''భాష''ను నిర్ధారించడం కూడా అంతే కష్టం అంటుంది స్వప్నలిపి. అలాగే భాష మళ్ళీ జీవించాలంటే అది ముందుగా నిర్ధారించిన రూపాల్లో కాకుండా అనిర్ణయ అస్తిత్వంలో అవతరించాలి అంటాడు అజంతా. ఈ అనిర్వచనీయమైన ''అస్తిత్వం'' కోసమే అజంతా తపన, ఘర్షణ అనిపిస్తుంది. ''స్వప్నలిపి రహస్యం ఇదే దైనందిన జీవన బీభత్సంలో నేను చేస్తున్న విచిత్ర విన్యాసాలే నా కొత్త ఛందస్సు'' కానీ ఈ విన్యాసాల్ని ఏ నిర్ధారితమైన వేదాంతం స్కూల్లోనో, అలంకారాల్లోనో ఇమడ్చడానికి ప్రయత్నించడం ఒక వ్యర్థ ప్రయాసే కాకుండా ఆ ప్రయత్నం అజంతా రచనల్ని చదవనట్టే అవుతుంది.

రోజూ చూస్తూనే ఉన్నాను.
ఉరితీయబడుతున్న అక్షరాలను.

మెరుస్తున్న మధ్యాహ్న సూర్యకిరణ ఖడ్గచ్ఛాయలలో
అక్షర తాండవం ఎవరైనా చూశారా?

గుండె లోలోతులలో అక్షర సంగీతం ఎవరైనా విన్నారా? (55-57)

అజంతా రచనల్లో భావ చిత్రాలు ఏదో పూర్వ నిర్ధారిత సిద్ధాంతానికి అనువైనటువంటి కవిత్వ భాష, యమక మయ పద్యాలు, సుకుమార సౌందర్య ఆహ్లాదకరమైన పదవాక్య సముదాయాలను, సున్నితమైన ఉద్వేగాలను ధ్వంసం చేస్తాయి. ముఖ్యంగా ఈ కూర్పు (Composition) లో గమనించాల్సింది: అజంతా భావచిత్రాలు ఏదీ ఒక స్థిర పడిన కవిత్వ పద సమూహం నుంచి వచ్చినవి కావు; ఏ ఇజం (Ism) తోనూ వీటిని ముడి పెట్టలేము. బట్టి పదాల లెవల్‌లో ఎక్కడైనా ఒక పద్ధతి క్రమం (Precedence) కనపడితే అజంతా వాక్యాల్లో, కవితా సందర్భాల్లో దృశ్యాల్లో వాటి రూపం మారిపోతుంది. ఈ ''ప్రతీకలు'' వికార పదచిత్రాలు అయినప్పటికీ అజంతా రచనలు ఏవో మానసికమైన Perverted morbidity ని చూపిస్తాయనలేము. అంటే ఈ ప్రతీకల వెనుక, ఈ రచనల మూలం ఏదో వ్యక్తిగతమైన మానసిక రుగ్మత అనడం పొరపాటు. సాహిత్య ప్రక్రియని మూలాన్వేషణలో విశదీకరించడం ఒక సంకుచిత దృక్పథమే కాకుండా సాహిత్య ప్రక్రియ వైశిష్ట్యత గుర్తించలేని అమాయకత్వం అవుతుంది. మూలాన్వేషణ అనేది కవి ''వ్యక్తిగతమైన'' మానసిక కథనాల ద్వారానైనా లేదా వ్యక్తి యొక్క సామాజిక, దేశ, కాల పరిస్థితుల, సందర్భాల దృష్ట్యానైనా లేదా ఏదో సాంస్కృతిక సంప్రదాయ భాషా నిఘంటువుల ద్వారా నైనా జరిగినప్పటికీ, ఇట్లాంటి అన్వేషణ ఎంత ముఖ్యమైనదైనా ఆ అన్వేషణలు ''సాహిత్య'' వైశిష్ట్యత చూపలేవు. ఈ అన్వేషణా మార్గం చాలావరకు సాహిత్య క్రియకు ఒక అనుబంధ స్థాయిని (derivative status) మాత్రమే ఇవ్వగలుగుతాయి. ఎంత వరకైతే ఈ మూలం ద్వారానే మనం చదవవలసిన దాన్ని చేరువ (approach) కాగలుగుతామనుకుంటామో మన ఎదురుగా ఉన్నదాన్ని అంటే ''కవిత్వాన్ని'' అర్థం చేసుకొనే ప్రాథమిక కర్తవ్యం వృథా అయిపోతుంది ఏదో స్థిరపడిన మూలాన్ని అన్వయించేది లేదా అందించేదే కవిత్వం అయితే అది సాహిత్య పరంగా(నే కాకుండా) కేవలం ఒక నిష్ఫల శ్రమ / ప్రక్రియ.

(సశేషం)

## కొౌతవెలుతురు

**- వి. శివలింగం**

భారతీయ సమాజాన్ని పట్టిపీడిస్తున్న కులవ్యవస్థను ఎందరో సంస్కర్తలు మేధావులు కూలగొట్టడానికి ప్రయత్నించారు కాని వ్యవస్థ మరింత బలపడుతూవచ్చింది. చార్వాకుల తరవాత కులవ్యవస్థను తీవ్రంగా వ్యతిరేకించిన వారు బౌద్ధులు అశ్వఘోషుడు బౌద్ధుడు. క్రీ శ ప్రథమశతాబ్ది ద్వితీయశతాబ్ది మధ్య కాలంవాడు కావచ్చు. జీవితకాలం గురించి తెలియడం లేదు. ఆనాడే వజ్ర సూచి అనే సంస్కృత గ్రంథాన్ని రచించాడు. 37 గద్యసూత్రాలతో బ్రాహ్మణధర్మానికి మూలమయిన వర్ణ వ్యవస్థను విమర్శించాడు. బ్రాహ్మణులంటే ఎవరో తెలియచేస్తుంది వజ్రసూచి. మలయశ్రీ గారు సరళ తెలుగు అనువాదం చేశారు. మిళింద ప్రచురణల తరపున రవిచంద్ గారు గ్రంథాన్ని తెలుగు వారికి అందించినందుకు కృతజ్ఞతలు రవిచంద్ వైదుష్యం ఏపాటిదో ఈ గ్రంథానికి అందించిన పీఠిక చదివితే తెలుస్తుంది. పాండిత్యం ప్రదర్శనగాకాక ప్రయోజనకారిగా వుండాలని కోరుకునే సహృదయుడు ఆయన. వజ్రసూచి ప్రభావంతో కూర్చిన వజ్రసూచికోపనిషత్తు కూడా చేర్చారు.

ఋగ్వేదం పురుషసూక్తం (10-90)లో చాతుర్వర్ణ్య ప్రస్తావన వుంది ఋగ్వేదకాలంలో వర్ణ వ్యవస్థ లేదు. బ్రహ్మ అంటే ప్రార్థన, సూక్తం అనే అర్థంలోనే కనిపిస్తుంది. సూక్తంలో వర్ణ పదం కనిపించలేదు వైశ్య, శూద్ర పదాలూ ఋగ్వేదంలో లేవు కనుక పురుషసూక్తం తరవాత కాలంలో చేర్చబడిందనడానికి సందేహంలేదు. అయితే ఎప్పుడు పుట్టిందో కచ్చితంగా చెప్పలేం. వేదకాలం పూర్తికాక ముందు 60 కులాలు, క్రీ.పూ. 500 నుండి క్రీ.శ 100 వరకు 125 కులాలు, ధర్మశాస్త్రాలు, స్మృతుల కాలానికి వుండేవని కానే పండితుడు రాశాడు. ఋగ్వేద సూక్తానికి, బృహదారణ్యానికి వర్ణాల పుట్టుకలో భేదం కనిపిస్తుంది పురుషసూక్తం మరచివుంటారు. మహాభారతంలో భిన్నాభిప్రాయాలు వున్నాయి వేద సూక్తాలు వల్లించేవారంతా కాలక్రమంలో బ్రాహ్మణులుగా రూపొందారు. మేధావివర్గం, విద్యావర్గం బ్రాహ్మణులే. బ్రాహ్మణులు క్షత్రియులు రాజ్యాలను చేజిక్కించుకుని మిగిలిన వర్గాలను అణచివేస్తూ వచ్చారు. విశాల హృదయులూ తాత్వికులూ వ్యవస్థను పట్టించుకోలేదు. మేధావి, పండితుడూ అయిన శంకరాచార్యులు కులవ్యవస్థను సమర్థించి తన అల్పత్వాన్ని చాటుకున్నాడు. కాళిదాసు అశ్వఘోషుడిని అనుకరించినా వర్ణ వ్యవస్థను ఖండించలేదు. వజ్రసూచి, ధమ్మపదం బ్రాహ్మణులంటే ఎవరో తెలియచెప్పాయి. కులంవల్ల కాదు గుణం వల్ల బ్రాహ్మణుడయ్యాడని చెపుతుంటారు. సమాజంలో కులంవల్ల బ్రాహ్మణులయిన వారిని గురించి ఆలోచించాలి ఏకులంలో నైనా మంచివారు చెడ్డవారూ వుంటారు. సామాన్యుల్ని చీకటి గుహల్లోకి తోసిన పురోహితవర్గం మీద ధ్వజమెత్తాల్సిందే. ఏనాడో చార్వాకులు చేశారు. ధర్మశాస్త్రాలు దుర్మార్గమైన పక్షపాతం చూపాయి.

ఋగ్వేదంలో వర్ణవ్యవస్థ లేదు. సత్యవ్రతులు, విజ్ఞాన సంపన్నులైన ప్రాచీనమహర్షులు కూడా నేడు మనం అనుకుంటున్న కులవ్యవస్థ (వర్ణవ్యవస్థ) గురించిపట్టుబట్టలేదు. సింధునాగరికత

---

★ **శివలింగం** తత్వం, సాహిత్యాలను నిశితంగా పరిశీలించారు, కృష్ణాజిల్లా, చల్లపల్లి నివాసి.

కాలం నాటికి స్థిరపడింది వర్ణవ్యవస్థ కాదనీ వర్ణ సంఘర్షణ మాత్రమేననీ ఒకళ్ళు కాదు - అంబేద్కర్‌తోపాటు - బాషం శ్రీవాత్సవ, కోశాంబి, చటోపాధ్యాయ లాంటి ఉద్దండులెందరో అధ్యయనం తరవాత అభిప్రాయానికి రావలసివచ్చిందని ఎబికె అన్నారు

బ్రాహ్మణులు క్షత్రియులు సంపదను అధికారాన్ని దోచుకున్నారు యజ్ఞకర్మల పేరిట క్షత్రియుల్ని దోచుకుంది బ్రాహ్మణవర్గం. స్వార్థపరశక్తులు పెరిగాయి. పురోహిత వర్గానికి శ్రామికవర్గానికి సంబంధాల్లేవు. బ్రాహ్మణ క్షత్రియ అపవిత్ర సంబంధం పురోహితవర్గంలో దురాశ పెరగడంతో, తెగిపోయింది. బృహదారణ్యక, చాందోగ్య, కఠోపనిషత్తులు క్షత్రియుల సృష్టి. పురోహితవర్గాన్ని బౌద్ధ జాతక కథలు అవహేళన చేశాయి. ఉపయోగపడే పశువుల్ని చంపి, విక్రయించడానికి లైసెన్సులిచ్చి పన్నులు దండుకుంది పురోహితవర్గం. బుద్ధుడు వీటన్నిటిని సహించలేక తిరుగుబాటు చేశాడు. అగ్రవర్ణ దోపిడీ నుండి సామాన్యుల్ని కాపాడాడు. నైతిక ధార్మిక జీవనానికి ప్రాధాన్యతయిచ్చాడు. మానసిక స్వేచ్ఛను ప్రసాదించింది బౌద్ధం. బౌద్ధం ఉచ్ఛస్థితిలో వున్నప్పుడు కూడా పురోహితవర్గం లొంగలేదు. కాని జీవన్మరణ సమస్యవారికి బి.సి.600-200 మధ్య కాలంలో, గౌతమ, ఆపస్తంభ, బౌద్ధాయన, వసిష్ట వంటి ధర్మశాస్త్రాలు వెలువడినాయి. బి.సి 200- ఎడి 200 కాలంలో మను, యాజ్ఞవల్క్యస్మృతులు వచ్చాయి. బ్రాహ్మణ రాజైన పుష్యమిత్రశుంగుని ప్రోత్సాహంతో మనుస్మృతి వచ్చింది. నందులతో క్షత్రియ పాలన లేకుండా చేశాడు మౌర్యులు శూద్రులు బ్రాహ్మణ శూద్రులకు తప్ప మరొకరికి స్థానం లేకుండా చేశాడు. అశ్వఘోషుని కాలానికి బ్రాహ్మణులు రాసిన ధర్మశాస్త్రాలు చదివి వారి దుర్మార్గాలను చూచి వినివుంటాడు. ఫలితమే వజ్రసూచి

గ్రంథంలో మూడు శ్లోకాలే తనవి. మిగతావన్నీ హిందూ శాస్త్రాలలోనివేనని మలయశ్రీ గారన్నారు. మహాభారతంలో బ్రాహ్మణ వర్గం ఎంతగా దిగజారిపోయిందో తెలుస్తుంది. బంగారం, పశువులు రాజులనుండి దానాలు పొందారు. బ్రాహ్మణులకిచ్చే దానాల గురించి అనుశాసన పర్వం ఎక్కువగా వర్ణించింది. భారతకాలానికి బ్రాహ్మణులు వ్యవసాయం, గోసంరక్షణను స్వీకరించారు. దొంగలూ, నటులూ, నర్తకులూ కూడావున్నారు. సత్యకాముడు జాబాలి వృత్తాంతం ద్వారా కులమూ గోత్రమూ కాదు గుణం కావాలి విద్యనేర్చుకోవడానికని తెలుపుతోంది శంకరాచార్యులు వక్రభాష్యం చెప్పాడు. ఒకసారి పరివ్రాజకాచార్యులు అనుభవానందస్వామిని తమ ఆశ్రమంలో స్థానమీయమని అడిగితే కులమూ గోత్రమూ అడిగారు అద్వైతాశ్రమం వారు గాని శివానందశ్రమం వారు గాని ఆవిధంగా అడగలేదు. చిన్నవాడివి గనుక జీవితాన్ని అనుభవించాలి అన్నారు. కులంగురించి ఒకకథ. రైల్లో ప్రయాణిస్తున్న వివిధకులాల వారు కులాల్ని గురించి ప్రశ్నించుకున్నారు. కాపు బ్రాహ్మణుడు, కమ్మబ్రాహ్మణుడు, విశ్వబ్రాహ్మణుడు భోగం బ్రాహ్మణుడు అని చెప్పుకున్నాక అనుమానంతో భోగం బ్రాహ్మణుడివి ఎలా అయావన్నారొకరు. మా అమ్మ భోగంది నాన్న బ్రాహ్మణుడు అందుకని అన్నాడట. మిగిలిన వారు అవాక్కయారు. వాడు చెప్పిన నిజం మిగిలిన వారికి చేదు అయింది

అశ్వఘోషుని వజ్రసూచి బ్రాహ్మణుడంటే ఎటువంటివాడో తెలియచేసింది. తెలుగు వారికి మంచి గ్రంథం అందించిన రవిచంద్ కృషి ఫలించాలంటే అందరూ చదవాలి. చదివించాలి.

# రష్యాలో రైతు

*('మిసిమి' వ్యవస్థాపక సంపాదకులు డా. ఆలపాటి రవీంద్రనాథ్ గారి రెండవ వర్ధంతి సందర్భంగా నాడు 1948లో ఆయన నడిపిన జ్యోతి మాసపత్రిక నుంచి ఈ వ్యాసాన్ని వారి స్మృతికి నివాళిగా పునర్ముద్రిస్తున్నాం. - సంపాదకుడు)*

-జి.వి. కృష్ణారావు

సాహిత్యంలో వాస్తవిక వాదానికి రష్యన్ రచయితలను చెప్పిన తరువాత ఎవరినైనా చెప్పాలి అసలు వాస్తవిక వాదం మొదట రష్యన్ సాహిత్యంలో పుట్టి, తరువాత ప్రపంచ సాహిత్యాలన్నిటిలోనూ వ్యాపించిదంటే ఏ మాత్రం అతిశయోక్తిలేదు వాస్తవిక వాదానికి విశిష్టత ఉత్తమస్థానం కల్పించింది, పెంపొందించింది రష్యన్ రచయితలే. 1920 నుంచి పుష్కిన్, గొగోల్, టర్గనివ్, టాల్‌స్టాయ్, డాస్టావోస్కి చకోవ్, గోర్కీ మొదలైన రష్యన్ రచయితలు దానికి జీవంపోశారు

ఈ వాస్తవిక వాదానికి ఆదర్శం కేవలం నిత్యనైమిత్తికాలను వర్ణించుట కాదు. మానవునిలోవున్న పశుత్వాన్ని నైచ్యాన్ని, అజ్ఞానాన్ని అర్థరహితంగా చిత్రించటంకాదు. సాహిత్యానికి పరమావధి ఉంది మాక్సింగోర్కీ అన్నట్టుగా సాహిత్యం మానవుణ్ణి తన్నుతాను అర్థం చేసుకోవటానికి తోడ్పడాలి. అతనిలో ఆత్మవిశ్వాసం పెంపొందించాలి సత్యం తెలుసుకొందామన్న తహతహలు కలిగించాలి. తనలో ఉన్న లోటుపాట్లను తెలుసుకొని వీటిని సమూలంగా పెకలించటానికి తోడ్పడాలి. తనలోని మంచిని తెలుసుకోనేటట్లు చేయాలి. తనలో పశుత్వం ఉన్నందుకు లజ్జ, అన్యాయం జరుగుతున్నందుకు క్రోధం, అధర్మాన్ని ప్రతిఘటించటానికి ధైర్యం, పెంపొందించాలి. మానవునిలో నైతిక బలం, సౌందర్య పిపాస, జీవితంపై అనురక్తి కలిగించాలి.

ఇలాంటి ఆదర్శాలు ప్రధానమైనప్పుడు, వ్యక్తి, సంఘం వ్యక్తి గుణావ గుణాలు జ్ఞానాజ్ఞానాలు, ప్రవర్తన, భాష, సంఘాచారాలు, సంస్థలు, వాటిలోని కీడు, మేళ్ళు, ధర్మాధర్మాలు యధాతథంగా స్వీకరించక తప్పదు. ఇవి క్షణికాలనీ, మాయా కల్పితాలనీ, పురాకృత సుకృతాకృత ఫలాలనీ, దైవలిఖిత మనీ, మంచి చెడ్డలకు భగవంతుండుండగా మన కెందుకు లెమ్మనీ ప్రాలుమాలటానికి వీలులేదు. వ్యక్తి విశిష్టమైన సంఘమంతా ఆమూలాగ్రం సాహిత్యానికి వస్తువై పోతుంది.

సంఘమంటే రష్యాలో నాటికీ నేటికీ అధిక భాగం రైతులే! రైతులేక పోతే 1918 వరకు ముప్పాతిక సంఘం లేదనే చెప్పాలి. అందువల్ల సాహిత్యంలో వాస్తవిక వాదం కోసం పోరాడుతూ వచ్చిన రష్యన్ రచయితలు తమ రచనలో సర్వసాధారణంగా రైతుకు ప్రాధాన్యం ఇస్తూ వచ్చారు. పెక్కు కథలలో నాటకాలలో, నవలలో రైతులే నాయకులు. చిన్న రచనలలో రైతులు కనిపింపకపోయినా, వారి స్థితి గతులు, కష్టనిష్ఠురాలు, సాధక బాధకాలు, గుణావగుణాలు, పరంపరా సంబంధగానైనా చిత్రించబడటం జరిగింది.

---

★ **శ్రీ.శే. జి.వి. కృష్ణరావు** ప్రసిద్ధి సాహితీవేత్త, దార్శనికుడు, విమర్శకుడు కీలు బొమ్మల రచయిత. ఈరచనను డి. కేశవరావు ఆంగ్లంలోకి అనువదించగా మాక్‌మిలన్ కంపెనీ ముద్రించింది

ఈ వాస్తవిక వాదం రసపుష్టికోసమని యదార్థ జీవితాన్ని తారుమారుచేయడం కాని, తమ సిద్ధాంతాలకోసం అతిశయోక్తులు తెల్పటంకాని, అభూత కల్పనలు చేయటంకాని, కృత్రిమత్వం ప్రవేశ పెట్టటంకాని జరగలేదు. రైతును వర్ణించినా, కార్మికుణ్ణి చిత్రించినా, విద్యావంతుణ్ణి ఉల్లేఖించినా, జమీందారును ప్రస్తరించినా, అతని మనోవాక్కాయ కర్మలలో గోచరించే వాస్తవికత్వాన్ని, దానివల్ల సంఘానికి మానవత్వానికి జరుగుతున్న ఉపకారపకారాలను యధాతథంగా చిత్రించారు.

రష్యన్ వాస్తవిక వాదంలోని విశిష్టత తెలుసుకోవాలంటే మన పూర్వీకుల రచనలను తీసుకొంటే తేలిపోతుంది. మన పూర్వకవుల్లోరైతులగూర్చి వ్రాయక పోలేదు. హాలుడు గాధాసప్తశతిలో ఎక్కువభాగం గ్రామ జీవితాన్ని గూర్చి వ్రాశాడు. కేవలం రైతులను గూర్చి వ్రాసిన గాధలు ఇరవైకిపైగా ఉన్నాయి. భార్యను కోలుపోయిన రైతును గూర్చి దున్నే దున్నే యెద్దును పోగొట్టుకున్న నిర్భాగ్యుణ్ణి గూర్చి, తడి పుడకలతో పొయ్యి మండక అవస్థపడే యిల్లాలిని గూర్చి వ్రాశాడు. అయితే మన సంప్రదాయం సూచిస్తున్న అర్థాన్ని బట్టిచూస్తే అవి కేవలం శృంగారం ఒలికించడంకోసం వ్రాసిన వేగాని మరొకటిగాదు. సంప్రదాయాన్ని ఆవల ఉంచి ఉన్నవి ఉన్నట్టుగా అర్థం చెప్పుకొన్నా రైతు మనః ప్రపంచంలో కాని బాహ్యప్రపంచంలో కాని జీవన్మాత్రుడుగానైనా పడే సంఘర్షణ కనిపించదు మృచ్ఛకటికంలో దొంగదగ్గరనుంచి రాజుదాకా చిత్రించాడు. కాని అతని దృష్టి ఒకటే. ఈ జీవితమంతా వట్టిమాయ. వట్టి మట్టి బండి తెలుగు సాహిత్యంలో చూదామా, బసవ పురాణం, అముక్తమాల్యద, పాండురంగ మహాత్మ్యం రైతు శ్రమజీవితాన్ని అసలు స్పృశించకపోలేదు. కేవలం భక్తికి దైవ దీక్షా ప్రచారంకోసం రైతుజీవితాన్ని పేర్కొన్నది. అముక్తమాల్యద ఆవు మందలవెంట పరిగెత్తే ఆబోతులను, రైతు స్థితిగతులను పేర్కొన్నది. పాండురంగ మహాత్మ్యం పల్లెటూరిజీవి, కాపును వర్ణించింది. అయితే రైతు మనస్సును, సంఘంలో అతడు నడిపే జీవితాన్ని, అతని సమస్యలను విశదంగా కాని, సూచన ప్రాయంగా గాని వర్ణించలేదు.

1830 నుంచి వచ్చిన రష్యన్ సాహిత్యం నిత్యజీవితాన్ని, సమస్యలను కూలంకషంగా చిత్రించింది, అసూచనంగా వస్తూవున్నంతమాత్రాన, దోషాలను వదల్లేదు. అవగుణాలు ఎక్కడ ఉన్నా, జమీందారులలో ఉన్నా, విద్యావంతులలో ఉన్నా, కార్మికులలో ఉన్నా, కర్షకులలో ఉన్నా కడిగివేసింది. మానవత్వంలో ఉన్న ఉదాత్తతను, సంఘంలో రావలసిన మార్పులను, ఉద్ఘోషించింది. తాను తెలుసుకొన్న సత్యాన్నిలోకానికి చాటటానికి రష్యన్ మహారచయితలంతా ప్రభుత్వం ఆగ్రహానికి గురి కావాలసి వచ్చినా, ఈషణ్మాత్రం కూడా వెను కంజ వేయలేదు పుష్కిన్ నిర్బంధానికి లోనయాడు. గోగోల్ పుస్తకాలను ప్రభుత్వం నిషేధించింది. టర్గనీవ్ సైబీరియా ప్రవాసాన్ని కొంచెంలో తప్పించుకున్నాడు. టాల్స్టాయ్ ప్రభుత్వ నిగ్రహానికి పాల్పడ్డాడు. డాస్టవిస్కీ ఉరిశిక్షను కొంచెంలో తప్పించు కొన్నాడు. గోర్కీ కారాగారవాసం అనుభవించాడు.

1830 నుంచి వెలువడిన సాహిత్యం పరిశీలిస్తే కర్షకుడు, కార్మికుడు, మధ్య తరగతివాళ్లు, భోగలాలసత్వంలో ఆనాడున్న జమీందారులు కన్నులకు కట్టినట్లు కనిపిస్తారు. గంభీర ఘోషతో పరుగులెత్తే జీవిత సముద్రం సక్షుబ్ధమహాతరంగాలతో ప్రత్యక్షమౌతుంది. అంత విస్పష్టంగా రష్యన్

చరిత్ర కూడా ఆ జీవితాన్ని మనకు ప్రత్యక్షం చేయలేదు. అసలు ఇలాంటి వాస్తవిక వాదానికి నాంది ప్రారంభించింది గోగోల్ మహారచయితలే వీరి రచనలలో కేవలం వాస్తవిక వాదంమాత్రమేకాదు. రొమేంటిసిజంకూడా మిళితమై ఉంది ముఖ్యంగా గోగోల్ తన రచనలలో ప్రభుత్వంలో ఆపాదమస్తకం వ్యాపించి ఉన్న కుళ్లను, రైతులు జమీందారుల క్రింది పడుతున్న బాధలను హాస్యాస్పదంగా చిత్రించాడు రైతుల బానిసత్వం నిర్మూలించటానికి కత్తి ఝుళిపించాడు

గోగోల్ తన కథల సంపుటిలో రైతుల అజ్ఞానాన్ని, అంధ విశ్వాసాన్ని చాలా హాస్యాస్పదంగా చిత్రించాడు వారిమీద ఆవ్యాజానురాగం కలిగించేటట్లు చేశాడు అతని హాస్యానికి రాతి ప్రతిమలైనా కరగిపోవలసిందే. అతని రచనలను అచ్చులో కూరుస్తూ కంపోజిటర్లుకూడా పొట్ట చెక్కలయేటట్లు నవ్వుకొంటూ ఉండేవాళ్ళట. దానితో పని చేరుపుగలిగి మేనేజరు వాళ్లను కూకలేస్తూ ఉండేవాడు. ఈ రచయితే తరువాత మృతజీవాలు అనే నవలను వ్రాశాడు. అది అన్నివిధాల విశిష్టమైనదని చెప్పాలి. వస్తువునుబట్టి, శిల్పాన్నిబట్టి పూర్వం ఇందులోని శిల్పం అలంకారశాస్త్రానికి తీర్చటానికి వీలులేని ఒక మహాసమస్య

మృతజీవాలు అన్న నవలలోని ప్రధానవస్తువు యిది. చిద్‌చికోవ్ అనే ఒక జమీందారు వుంటాడు. అతనికి ఎక్కువ ఆస్తి సంపాదించి తన సమాజంలో అగ్రగణ్యుడు కావాలని కోరిక. ఈ కోరిక కలిగేనాటికే దేశంలో అంటువ్యాధులు బయలుదేరి నిస్సహాయులైన రైతులు వేలకువేలు చచ్చిపోతారు. అనాటి రష్యన్ రైతుకూ, యీనాటి రష్యన్ రైతుకూ ఎక్కడా సంబంధం లేదు. రష్యన్ రైతులు అప్పట్లో మూడు రకాలుగా ఉండేవాళ్లు. కేవలం జమీందారు బానిసలు. వీళ్ళనే సెర్ఫ్స్ అంటారు. వీరూ, వీరుదున్నేభూమి, జమీందారు ఆస్తులే. భూమిని అమ్మినట్టుగానే, ఈ బానిసలను అమ్ముకోవచ్చును. భూమికి మనం శిస్తుకడుతున్నట్లుగానే జమీందారులు ప్రభుత్వానికి ఈ బానిసలకని పన్నుకట్టేవారు. పోతే రెండోతరగతివాళ్ళు స్వతంత్రకర్షకులు, సొంత ఆస్తులు ఉండేవి. అయినా జమీందారుకు లోబడి ఉండవలసిందే, మూడో తరగతి ఉమ్మడి సాగు చేసికొనే రైతులు వీళ్ళూ జమీందారులకు లోబడి ఉండవలసిందే.

కథానాయకుడైన చిట్‌చికోవ్ ఈ బానిసలను కొనాలని ఉద్దేశం. బ్రతికిన వాళ్లను ఉట్టి ఉడియంగా ఎవరూ ఇవ్వరు. చచ్చినవాళ్లనైతే తృణమోపణమో యిస్తే తనకు అమ్మివేస్తారు ఎందుకంటే సెర్ఫ్స్‌పైన జమీందార్లు ప్రభుత్వానికి పన్నుకట్టాలి. జనాభా లెక్కలు పదిసంవత్సరాల కొకసారి కాని తీసుకోరు. ఈ మధ్యలో రైతుబానిసలు బతికి ఉన్నా చచ్చిపోయినా మళ్ళీ జనాభాలెక్కలు తీసుకొనేటంతవరకూ ప్రభుత్వానికి పన్నుకడుతూ ఉండవలసిదే. చచ్చిపోయిన రైతులపై కట్టవలసిన పన్నుబాధ తొలగించుకోటానికి ప్రతి జమీందారు సహజంగా ప్రయత్నిస్తాడు బ్రతికున్న వాళ్లను కొనుక్కొంటే లాభంవుంది, వాళ్లచేత వెట్టిచాకిరీ చేయించుకోవటమో, లేక తిరిగి లాభానికి అమ్ముకోవటమో చేయవచ్చును. చచ్చినవాళ్లను కొని ప్రయోజనమేమిటి అన్న సందేహం తప్పకుండా కలుగుతుంది. చిట్‌చికోవ్ అద్వితీయ ప్రతిభాశాలి. నామమాత్రపు ధరలకు చచ్చిపోయిన రైతుల పేర్లను, వాటికి సంబంధించిన రిజిష్టరు పత్రాలను కొని వాటిని తీసుకువెళ్ళి

స్టేట్ లాండ్ లార్డ్ బ్యాంకుకు తనఖా పెట్టి పెద్ద మొత్తం పుచ్చుకొని పరారై రష్యాలో మరొక రాష్ట్రంలోనే ఆస్తిపాస్తులు కొనుక్కొని గౌరవంగా బ్రతకాలని ఉద్దేశం. ఈ మహాప్రారంభానికి కథానాయకుడు బయలుదేరాడు. గవర్నరును తదితర ప్రధాన ఉద్యోగస్థులను, పెక్కుమంది జమీందార్లను సందర్శిస్తాడు. బేరంసంగతి అసలుగుట్టు బయటపడకుండా తగు జాగ్రత్తతో ఎత్తుతాడు కాని క్రమక్రమంగా ఆసంగతి చివరికి ఒక్కసారి గుప్పుమంటుంది. చిట్‌చికోవ్ అకస్మాత్తుగా జారుకొంటాడు.

ఇదీకథ. అలంకారికులుకోరే కథా నిర్మాణం, విధించే ఆదిమధ్యాంతాలు లేవు. కేవలం కథానాయకుడు కలుసుకొన్ని ఉద్యోగస్థులపాత్రలు, జమీందారుల భూమికలు కళ్లకుగట్టినట్లుంటాయి. జమీందారునైచ్యం, అమానుషత్వం, లుబ్ధత్వం బట్టబయలౌతాయి. రైతులసంగతి సాక్షిత్తుగా వ్యజ్యమానము లౌతాయి

ఈనవల చదువుతుంటే మన పెదవులు నవ్వుతుంటాయి. హృదయం కరుణాతి రేకంతో గిజగిజ లాడిపోతుంది. మనకు తెలిసినంతో ఏదో ఒక రసం ప్రతీత మౌతుంది రసంతో రసాంతర ప్రతీతి కావటం అపూర్వం. ఒకే కావ్యం రెండు మూడునాలుగు అర్థాలిచ్చేటట్లు వ్రాశారు కాని, ఒకే కావ్యం రెండురసాలు కలిగేటట్లు వ్రాయలేదు. అలంకారిక శేఖరుడైన పండితరాయలు రసాంతర్యానికి కొలది లక్ష్యాలు చూపించాడు కాని, ద్విరస ప్రధాన కావ్యాలను అతడు పేర్కొనలేదు. అసలు అతర్కితోత్పన్నమైన ఆ ప్రతిభతో ఊహించను కూడా ఊహించలేకపోయాడు.

మొత్తంమీద ఇలా ప్రారంభమైన రష్యన్ వాస్తవికవాదం టర్గనీవ్, టాల్‌స్టాయ్, డాస్టవిస్కీ, చకోవ్, గోర్కీ గ్రిగ్‌రొవిచ్, మేరిమార్కోచ్ డేనిలి విస్కీ, పిసెంస్కీ, రైషెట్‌నికోల్‌మొదలైన వారి చేతుల్లో పడి మరీ సానలు దేరింది.

టర్గనీవ్ రచన అన్నిట్లోను ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా రైతుల జీవితాన్ని సమస్యలను స్పృశించటం, చిత్రించటం కనిపిస్తుంది ముఖ్యంగా అతని స్పోర్ట్స్ మన్స్‌గోడ్‌బుక్ అనే కథల సంపుటిలో జమీందారుల క్రింద రైతులు పడుతున్న అవస్థలు చక్కగా కనిపిస్తాయి. రచయిత కథాచిత్తుగా జరిగే ఘోరాతి ఘోరాలను వర్ణించలేదు నిత్యజీవితంలో రైతులు జమీందారులవల్ల పడుచున్న బాధలను వర్ణించాడు. రైతులపై సానుభూతి కలిగించటానికని వాళ్లను కొండమీద కూర్చోబెట్టలేదు. జమీందారుల జాతిజాతే జనపాదానవులని చిత్రించలేదు. ఈ అన్యాయానికంతా జమీందారీ విధానంలో ఉందనీ, ఆ విధానం రద్దు కావాలనీ సూచించాడు

టాల్ స్టాయ్ రచనలో, రైతు జీవితాన్ని స్పృశించని రచన లేదనటంలో అతిశయోక్తిలేదు. ముఖ్యంగా రైతు జీవితాన్నే ప్రధాన కథావస్తువుగా తీసుకొని వ్రాసినవాటిల్లో దిమార్నింగ్ ఆఫ్ ఎలాండేడ్ ప్రొప్రైటరీ, ది కొసక్కు అన్న నవలలో పోలికుష్కా, బృహత్కథ, ది పవర్ ఆఫ్ డార్నెస్ అన్న నాటకం ముఖ్యమైనవి. మానవత్వం, సత్యం, దయా, శౌచం, ప్రేమి, విశ్వకల్యాణం అతడు హృదయపూర్వకంగా సాహిత్య కుసుమంతో అర్పించాడు. చిత్తశుద్ధిగా ఆచరించాడో, విశ్వసాహిత్యంలో ఆజరామర స్థానం సంపాదించాడు.

అతని ఏ చిన్నరచన తీసుకొన్ని వాస్తవికతత్వ గ్రహణంలో చిత్రణలో ఎంత నిశితత్వం ఉందో స్పష్టంగా గోచరిస్తుంది ఉదాహరణకు పోలికుష్కా కథనే తీసుకొండి. భూస్వామిని, సెర్ఫ్ స్వతంత్ర కర్షకుడు, ఉమ్మడి సాగుచేసే రైతు జీవితం స్పష్టంగా కనిపిస్తుంది

భూస్వామికి ఆమె ఎస్టేటు తరపున ముగ్గురు సైనికులను పంపించవలసిందని తాఖీదు వస్తుంది ఇద్దరు దొరుకుతారు. మూడో మనిషి దొరకడు. ఆ మూడో మనిషిని రైతులలో నుంచి ఏరి అయినా పంపించాలి. లేదా స్వతంత్రంగా ఉంటున్న రైతు కుటుంబాలలోనుంచి ఒకరిని ఏరి పంపించాలి. డిట్ లోవ్ కుటుంబంలో యుద్ధానికి పోదగిన కుర్రవాళ్ళు ముగ్గరుంటారు తతిమ్మా కుటుంబాలన్నీ ఒంటి సంసారాలు. లేకపోతే మగవాళ్లు ఇద్దరు ఉంటారు ముగురున్న కుటుంబాన్ని వదలి ఇద్దరున్న కుటుంబంలోనుంచి మనిషిని పంపించటం ఏమి ధర్మం? అందువల్ల డట్లోవ్ కుటుంబంలోనుంచి ఒకర్తిని పంపించాలి లేదా భూస్వామిని తన క్రింద రైతులలో ఒకరిని పంపించాలి

భూస్వామిని హృదయం చాలా మెత్తనిది లెండి. ఎవరికీ తాను స్వయంగా అపకారం చేసి పాపంకట్టుకోవటం ఇష్టంలేదు ఆమె రైతులలో పోలికుష్కా అనే వ్యర్థుడొకడున్నాడు వాడు త్రాగుబోతు చిన్న చిన్న దొంగతనాలు చేస్తాడు. వాణ్ణి క్రిందటి రోజుననే క్షమించింది. బైబిల్ చెప్పిన ధర్మసూత్రాలు బోధించింది ఎలా పంపిస్తుంది. పైగా అతనికి భార్య, అయిదుగురు పిల్లలు. వాణ్ణి పంపిస్తే సంసారం అఘోరించదూ? అందువల్ల దయార్థ్ర హృదయులైన భూస్వామిని తన మేనేజరునే ఎవరినో ఒకరిని చూచి పంపించమంటుంది. మేనేజరు మూడో మార్గం సూచిస్తాడు. ఖరాయబిల్సు చెల్లిస్తే మరొకణ్ణి సైన్యంలోకి పంపించవచ్చు నంటాడు. మేనేజరు నిర్ణయానికి ఆ సమస్యను వదులుతుంది.

తరువాత పోలకుష్కాను పట్టణంలో ఒక వర్తకుడు 1500 వందల రూబిల్సు ఇవ్వవలసి వుంటే ఆ మొత్తం తెమ్మని పంపిస్తుంది. లాటరీ ప్రకారం డట్లోవ్‌రైతు తన తమ్ముడి కొడుకును యుద్ధానికి పంపించవలసి వస్తుంది. పాపం సైన్యం లోకి పోవలసిన ఆ నిర్భాగ్యుడుకి అంతకు ముందు కొలది రోజుల క్రిందటే పెండ్లయింది. వాడి అవస్థ చెప్పటానికి వీలులేదు అతడు పెదతండ్రిని తిడతాడు. పిసినిగొట్టుఅంటాడు. తండ్రి తన కొడుకును సైన్యంలోకి పంపక తండ్రిలేని తన్ను పంపుతున్నాడంటాడు నిజానికి డట్లోవ్ వద్ద కాస్తోకూస్తో డబ్బు ఉంది. దాన్ని తమ్ముడు కొడుకును విడుదల చేయించటానికి వినియోగిస్తే కుటుంబం ఏమిగాను. పెండ్లి కావాలసిన కొడుకున్నాడు. ఇంట్లో తిన వలసిన వాళ్లు అయిదుగురున్నారు. పొలం పండుతుంది ఎండుతుంది. ఎలా జరగాలి. అందువల్ల అతడు తమ్ముడుకొడుకును విధిలేక సైన్యంలో చేర్పించటానికి ప్రక్కన ఉన్న పట్టణానికి తీసుకు వెళ్లుతాడు

పోలికుష్కా వర్తకుడివద్ద డబ్బుముద్ర శుద్ధిగా పుచ్చుకుని ఆడబ్బు కవరు చినిగి పోయిన టోపీలో దూర్చి భూస్వామి వద్దకు గుర్రపుబండీలో తిరిగివస్తూంటాడు. మరీ ఊరిదగ్గరకు వచ్చి డబ్బుకోసంటోపీ తడువుకుంటే కనిపించదు. ఇంటికి వెళ్లటానికి ముఖం చెల్లదు. మళ్లీ గుర్రాన్ని వెనక్కి తిప్పి వచ్చిన దారంతా రోజల్లా వెతుకుతాడు. కనిపించదు

మరునాడు పోలికుష్కా యింటికి చేరుకుంటాడు భార్య చూడకుండా అతడు ఉరి పోసుకొని చచ్చిపోతాడు ప్రక్కవాళ్లెవరో పనిమీద లోపలికి వెళ్లి అతని శవాన్ని చూచికేకవేస్తారు. నీళ్ల తొట్టిలో పసిపిల్లను స్నానం చేయిస్తున్న భార్య ఈ సంగతి తెలిసి చేతిలో పిల్లను నీళ్లతొట్లోనే వదలి భర్తశవం దగ్గరకు వస్తుంది పసిపిల్ల నీళ్లతొట్లో పడి చచ్చిపోతుంది. భూస్వామిని ఆదరాబాదరా వచ్చి చచ్చిపోయిన ఆ శిశువును, పోలికుష్కానుకళ్లారచూడలేక యింట్లోకి తిరిగి వెళ్లిపోతుంది

డట్లోవ్ తమ్ముడికొడుకును ఆఫీసులో అప్పగించి యింటికి వస్తూవుంటే డబ్బు సంచికనిపిస్తుంది. దానిమీద చిరునామాను ఎవరిచేతనో చదివించుకొని భూస్వామిని డబ్బని తెలుసుకొంటాడు నేరుగా ఆమె యింటికి వెళ్లియివ్వటానికి ప్రయత్నిస్తాడు. ఆ పాపిష్టిడబ్బే కదా యింతచేసింది నా కక్కరలేదు అది నీవే తీసుకొమ్మని యజమానురాలు చెబుతుంది.

డట్లోవ్ ఆ డబ్బు తనకేనని నిర్ధారణ చేసుకొన్న తరువాత ఇంటికి పరిగెత్తుతాడు మరునాడు ప్రొద్దున్నే 400 రూబిల్సు ఇచ్చి మరొకణ్ణి సైన్యంలో చేర్పించి తమ్ముడు కొడుకును విడిపించుకొస్తాడు.

ఇందులో భూస్వామిని వ్యక్తిగతంగా నిందించింది ఏమీ లేదు. జమీందారు వర్గంవారి నీతిలోని నైచ్యాన్ని టాల్‌స్టాయ్ సుస్పష్టం చేశాడు. డట్ లోవ్ కంటె భూస్వామిని ఏవిధంగా ఉత్తమురాలు? నిజంగా మొదట్లోనే 400 రూబిల్సు తనవికాదని యిచ్చివేసి ఉంటే పోలికుష్కా అతని పసిపాప చచ్చిపోయి ఉండేవాళ్లుకాదు పైగా డట్‌లవ్ కుటుంబంలో అలజడి ఉండేది కాదు. తీరా భూస్వామిని ఏమన్నా ఒడ కట్టుకొన్నాదా అంటే ఆదీ లేదు 1500 రూబిల్సు వదులుకొంది.

ఈ రచనను బట్టి రష్యన్ రచయితలు వాస్తవికవాదంలో ఏమెట్టుకు వెళ్లారో, స్పష్టంకాకపోదు. 1861 సెర్ఫ్‌డం రద్దయినదంటే యీ రచయితలే కారణం అనడంలో అతిశయోక్తిలేదు.

విప్లవానంతరం కూడా రైతును ఎన్నో సమస్యలు ఎదుర్కొన్నాయి. ఉమ్మడి వ్యవసాయంలో ఎన్నో ప్రశ్నలు బయలు దేరాయి వాటిని రైతులు ఎలా ఎదుర్కొన్నారో షోలొకోవ్ క్వైట్ ఫ్లోస్ తిఖిడాన్'' అనే నవలలో చిత్రించాడు.

తరువాత మొన్నటి ప్రపంచ సంగ్రామంలో ఫౌజా దురాక్రమణను రష్యన్ రైతులు ఎలా ప్రతిఘటించారో ఇంద్రధనస్సులాంటి నవలలు, ముసలి అవ్వవంటి కథలు చాటుతున్నాయి.

సాహిత్యం బాగుపడాలన్నా, సంఘం పరాకోటికందుకోవాలన్నా వాస్తవికవాదం అత్యంత ప్రధానం రైతు కార్మికుడు విద్యావంతులు వీళ్ల జీవితాలు సమగ్రంగా, నిశితదృష్టితో చిత్రించటం అవసరం, ఇంతకువినా అభ్యుదయానికి మార్గం లేదు

- ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిన.

# జీసస్ క్రీ.పూ.12వ సంవత్సరంలో జన్మించాడు?

– మిసిమి వర్క్‌షాపు

ప్రస్తుతం లెక్కల ప్రకారం రాబోయే శతాబ్దంలోకి, అంటే 21వ శతాబ్దంలోకి, అప్పుడే 12 సంవత్సరాలు ముందుకు చొచ్చుకుపోయాము అంటే మనం ఇప్పటికే 2009వ సంవత్సరంలోకి ప్రవేశించాం అన్నమాట క్రీస్తు అందరూ నమ్ముతున్నట్లు కాక, క్రీ.పూ.12వ సంవత్సరంలో జన్మించాడని ఇటలీకి చెందిన ఖగోళవేత్త లెక్కలు గట్టి తేలుస్తున్నాడు.

ఒక ప్రక్క పాశ్చాత్య ప్రపంచం 1998 సంవత్సరానికి మొన్న జనవరి 1న స్వాగతం పలుకుతుండాగా, ప్రొఫెసర్ గియోవన్ని బరట్టా అనే శాస్త్రజ్ఞుడు ఆగస్టస్ చక్రవర్తి కాలాన్ని బెతల్‌హామ్ నక్షత్ర అవతరణ కాలాన్ని, సంప్రదాయ ఆలోచనకు విరుద్ధంగా తిరగరాశాడు 2000 సంవత్సరం రానూ వచ్చింది. పోనూ పోయింది. ఇప్పుడు మనం 2009 సంవత్సరాంతంలో ఉన్నాం. 2010 సంవత్సరంలో ప్రవేశించనున్నాం

క్రీస్తు జనన తేదీని ప్రశ్నించడం ఇదే మొదటి సారికాదు మామూలుగా అందరూ అనుకొనే దానికంటె క్రీస్తు ఏడు సంవత్సరాలు ముందు పుట్టాడని పదిహేడవ శతాబ్దికి చెందిన జాన్ కెప్లర్ చెప్పాడు జ్ఞానులకు, గొర్రెల కాపరులకు జీసస్ జన్మస్థలానికి దారి చూపిన బెతల్‌హామ్ నక్షత్రం గురించి సువార్తలలో పేర్కొన్న సమయం మీద ఎంతో పండిత చర్చసాగింది. ''నేను ఎన్నో ఏళ్ళుగా పరిశోధనలు సాగించాను. బైబిల్ మూలాలకు వెళ్ళాను. రోమ్ చరిత్రను అధ్యయనం చేశాను ఖగోళాన్ని పరిశీలించాను. ఫలితంగా నేను క్రీస్తు జననానికి సంబంధించి కొత్త సాక్ష్యం సేకరించగలిగాను'' అని రోమ్ గ్రహవేధశాలకు చెందిన ఆచార్య బరట్టా (55) చెబుతున్నారు. క్రీ.శ ఆరవశతాబ్దిలో డయోనిసియస్ ఎక్సిగుస్ ( ఆంగ్లంలో ఇతనిని డెనిస్ ది లిటిల్ అంటారు) అనే సిథియన్ సన్యాసి (Scythian Monk) పెద్ద కీలకమైన తప్పిదం చేశాడు. ఇతడు గొప్పగణిత వేత్త. అందుకని ఇతనిని ప్రథమ పోప్ జెలాసియస్ (Gelasius) మత సంబంధమైన చారిత్రక పత్రాలను ఒక క్రమంలో అమర్చిపెట్టవలసిందని కోరాడు. కాని ఇతడు 496 AD లో, రోమ్ వచ్చేటప్పటికే పోప్ మరణించాడు. ఇతడు 525 AD లో, ఇప్పుడు ప్రపంచమంతా ఆమోదించిన పంచాంగాన్ని (కాలెండర్‌ని) తయారుచేశాడు. ఈ కాలెండరు తయారు చేయడంలో డెనిస్ ''సున్న'' సంవత్సరాన్ని, అంటే క్రీ పూ. ఒకటికి క్రీ.శ ఒకటికి మధ్య సంవత్సరాన్ని (1 B C 1 A.D. ల మధ్య కాలాన్ని), పరిగణనలోకి తీసుకోలేదు. అంతేకాదు, ఆక్టేవియస్ పేరుతో రోమన్ సింహాసనాన్ని అధిరోహించిన రోమన్ చక్రవర్తి ఆగస్టస్ పాలనా కాలంలో నాలుగు సంవత్సరాలను, 31-27 BC కాలాన్ని విస్మరించాడు. ఆగస్టస్ తరవాత సింహాసనం ఎక్కిన అతని మారుతండ్రి (Stepfather) టైబెరియస్(Tiberius) పాలనలో మొదటి రెండు సంవత్సరాలను వదిలివేశాడు. టైబరియస్ 14 AD లో చనిపోయాడు.

ఈ విధంగా అతడు ఏడు సంవత్సరాల కాలాన్ని వదిలిపెట్టి చేసిన తప్పిదం కెప్లర్‌సిద్ధాంతాన్ని బలపరుస్తుందని ఆచార్య బరట్టా చెబుతున్నారు.

అంతేకాదు, కెప్లర్‌కున్న ముఖ్యాధారం - సెయింట్ మాథ్యూ వర్ణన ప్రకారం అతడు

గుర్తించిన బెతల్‌హామ్ నక్షత్రం 7 BC లో గురువు, శనిల సంయోగాన్ని సూచిస్తుందని కెప్లర్ భావించాడని బరట్టా అంటున్నాడు. కాని కెప్లర్ లెక్కలన్నింటిని బరట్టా తిరిగి పరిశీలించాడు. అందులో ఇతనికి అనేక తేడాలు కనిపించాయి. కాని బరట్టా లెక్కలన్నీ మిధునరాశి సింహరాశుల మధ్య అతి ప్రకాశవంతమైన నిప్పులుగక్కుతూ ''పయనించే'' నక్షత్రాన్ని సూచించాయి ఇది క్రీ.పూ 12 లో కనిపించింది. కాని వాస్తవానికి అదొక తోకచుక్క ఈ తోకచుక్కను ఆకాలపు చైనా ఐరోపా ఖగోళజ్ఞులు గూడ గుర్తించారు

గ్రీకు చరిత్రకారుడు AD మూడవశతాబ్దంలో కాసియస్ డియో రాసిన తన 80 సంపుటాల చరిత్ర ''రోము చరిత్ర''లో ఒకమండుతున్న తోకగలిగిన ఒకతోకచుక్క క్విరినియస్(Quirinius) బెసల్లా, బర్బాటో (Bessalla, Brbato) లు దౌత్యవేత్తలుగా ఉన్న సమయంలో కనిపించింది. అది చాలా రోజులు అలాగే ఉందని రాశాడు. ఈ తోకచుక్కను కొంతమంది హాలె (Halley) తోకచుక్కగా చెప్పారు. దీనిని మొదట 240 BC లో రికార్డుచేశారు.

అయితే బరట్టా తను చెప్పిందే వేదం అనడంలేదు. పూర్తి సత్యం ఇదే నని నేను చెప్పలేను. కాని నాకు లభించిన ఆధారాలన్నీ క్రీస్తు 12 BC లో జన్మించాడని సూచిస్తున్నాయి. ముఖ్యవిషయం 12 BC లో అతి కాంతివంతమైన పయనించే నక్షత్రం, మిధున సింహరాశుల మధ్య కనిపించడం. మనం నమ్ముతున్నదాని కంటె క్రీస్తు 12 సంవత్సరాలు ముందు పుట్టాడంటే ఆయన పవిత్రతకు ఏ మాత్రం భంగం కలగదు. దీనివలన మన పంచాంగాలు మారవు. ''ఏది ఏమైన, పండితులు, ఖగోళజ్ఞులు ఏమి చెప్పినా, 2000 సంవత్సరం మూడవ సహస్రాబ్దానికి నాంది'', అని వాటికన్ అధికారులు వాకొంటున్నారు.

---

# Before and After (Noon) Falls the Shadow

*It is incorrect to use 'a.m.' or 'p.m.' after '12' when we mean noon or midnight, writes Charles Newton.*

It is hoped that there were at least some new year resolutions to make fewer errors in English than in the preceding year. In a questionnaire to readers on New Year resolutions, a newspaper asked what they would be doing at "12 a.m. on December 31". A newspaper should know that "12 a.m." or "12 p.m." is an absurdity. "12" can be only one of two things: midday or midnight.

The letters, "a.m." stand for "ante meridiem", which is a Latin term for "before noon". Since "12" itself is "noon", "12a.m." is an obvious contradiction. The letters, "p.m." stand for "post meridiem" (after noon) - which is vague and also fallacious because what is meant is "12 midnight". Only a second after midnight of 31 December-1 January will be the New Year. That time will be written as "12.01 a.m.", which would be as close to accuracy as practicable.



Czeslaw Milosz

*"who, with an uncompromising lucidity, expresses the condition of man exposed to a world of severe conflicts"*

1980 Nobel Prize in Literature

MISIMI/మిసిమి RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd. No. H/SD/191.



Gabriel Garcia Marquez

*"for his novels and short stories, in which the fantastic and the realistic are combined in a richly composed world of imagination, reflecting a continent's life and conflicts"*